# అప్సరా మరియు నటరాజ్ పెన్సిళ్లు
## రంగురంగుల డిజైన్లలోని అందం
## చేతిలో ఇంద్రధనసు లాంటి మురిపెం.




**అప్సరా** మరియు **నటరాజ్**

పెన్సిళ్ళు ఎక్కువ కాలం పనిచేసే పెన్సిళ్ళు

హిందూస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్, 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.

OBM 4714 TL


Cadbury
GEMS







# చందమామ

డిసెంబర్ 1981



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-75

సంవత్సర చందా: 21-00

నా జన్మదినం నాడు
ఒక క్రొత్త కానుక

అదే **యూకో బ్యాంక్**
పాస్ బుక్



ఈ కానుక తనతో తెస్తుంది మరెన్నో కానుకలు అదే నా యూకోబ్యాంకు పాస్ బుక్.

ఈ చక్కని ఆలోచనకు నీకు ధన్యవాదాలమ్మా! నా స్వల్పమైన పొదుపును ఎన్నో రెట్లు అధికం చేసే యూకోబ్యాంకు వారూ మీకు నా "ధన్యవాదాలు"



**యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్**
మీకు దగ్గరలో వున్న మంచి సదుపాయాలున్న బ్యాంక్

UCO/CAS-69/80 TEL

**Results of Chandamama—Camlin Colouring Contest No. 21 (Telugu)**

*1st Prize:* T. Viswaprasad, Hyderabad-500 001. *2nd Prize:* A. Lakshmi. Kazipet. *3rd Prize:* P. Narasimha Murthy, Secundrabad. *Consolation Prizes:* Vinita Patny Securderabad-500 003, V. Geeta, Hyderabad, M. Krishnasai, Kajahmundr-5; D. Vidya Sagar, Proddatur; Shaheda, Rajahmundry-533 103.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''రాజయోగి'']కి ఆధారం, గంగిశెట్టి శివకుమార్ రచన. ఒకరకం మూఢ విశ్వాసాలకు, ఆ య్యా వ్యక్తుల స్వానుభవం మూల కారణం అవుతుంది. అలాంటి వారిచేత లౌక్యం ద్వారా పరోపకార్యాలు ఎలా చేయించవచ్చునో, ''మాయకల'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

సర్పః క్రూరః ఖలః క్రూరః, సర్పాత్ క్రూరతరః ఖలః,
మంత్రౌషధవశః సర్పః, ఖలః కేన నివార్యతే.

[క్రౌర్యంలో విషసర్పానికి, దుష్టుడికి భేదం లేదు. కాని పాము కాటును మంత్రౌషధాలతో నివారించవచ్చు; దుష్టుడిపట్ల అది సాధ్యం కాదు.]

సంపుటి 69 డిసెంబర్ '81 సంచిక 6

విడి ప్రతి : 1-75 : : సంవత్సర చందా : 21-00




CHITRA



# పెర్రి వెంగళప్ప

వెంకప్ప అన్నదమ్ముల్లో ఆఖరివాడు. వాడికి అన్నలందరికంటే చదువు బాగా వచ్చింది. చాలా తెలివైనవాడని విద్య నేర్పిన గురువు అన్నాడు. కాని, చిన్నప్పటి నుంచీ వాడి ధోరణి ఎరిగిన అన్నలు మాత్రం, "తెలివితేటలున్నా, వీడికి లోకజ్ఞానం లేదు. ఇలాంటివాడు రాజుగారి కొలువులో ఉద్యోగానికి తప్ప మరెందుకూ పనికిరాడు. వీడికి ఎలాగో ఒకలా అక్కడ ఉద్యోగం వేయించు," అని తండ్రికి చెప్పారు.

ఇందుకు వెంకప్ప ఒప్పుకోక, తండ్రితో, "రాజుగారి కొలువులో ఉద్యోగం చేయడం నా కిష్టమే. కాని, నేను అన్ని పనుల్లోనూ పనికివస్తానని తేలాకే, అక్కడికి వెళతాను. ఒక్క సంవత్సరం నాకు వ్యవసాయం చేసే అవకాశం యివ్వు. నా శక్తి రుజువు చేస్తాను," అన్నాడు.

తండ్రి వాడికి అయిదెకరాల భూమి యిచ్చాడు. వెంకప్ప మట్టిని పరీక్షించి, అందులో ఏది బాగా పండుతుందో నిర్ణయించి, ఆ పంట వేశాడు. వాతావరణంలోని మార్పులను శ్రద్ధగా గమనిస్తూ, తగిన జాగ్రత్తలు తీసుకున్నాడు. ఆ ఏడు వాడి పొలం విరగపండింది. అన్నలకంటె ఎక్కువదిగుబడి సాధించాడు.

వెంకప్ప పంటనంతా అప్పటికప్పుడే అమ్మివేసి, డబ్బు చేసుకున్నాడు. బాగా సంపాయించానన్న ఉత్సాహంలో, కాస్త విలాసంగా ఖర్చు పెట్టాడు. ఆరునెల్లు గడిచేసరికి వాడి దగ్గిర డబ్బంతా అయిపోయింది. తిరిగి కొత్త పంట వేయడానికి పెట్టుబడికి గాను ఏమీ మిగలలేదు. అయితే, వాడికంటె తక్కువ భూమిలో, అంతకంటె తక్కువ పంట పండినవారు కూడా సుఖంగా వున్నారు.

"వసుంధర"

ఇందుకా్కరణం లేకపోలేదు. మిగతా వాళ్ళందరూ, మంచి ధర వచ్చేదాకా ఆగి పంట అమ్ముకున్నారు. పొలమంతా ఒకే పంట వేయకుండా, ఇంట్లోకి అవసరం అయిన ఇతరత్రా పంటలు కూడా వేశారు. వెంకప్ప మొత్తమంతా అమ్మివేయడం వల్ల, తనకా్కవలసిన తిండి గింజలు కూడా, తను అమ్మినదానికి రెట్టింపు ధరకు కొనుకో్కవలసి వచ్చింది.

''వీడు వెర్రివెంగళప్ప అని ముందే చెప్పాం. తొందరగా వీడికి ఉద్యోగం వేయించు,'' అని అన్నలు తండ్రిని హెచ్చరించారు.



వెంకప్ప తండ్రి కాళ్ళు పట్టుకుని, ''వ్యవసాయం నాకు అచ్చిరాలేదు. అయినా, అది ఒంట్లో బలం వున్నవాళ్ళు చేయవలసినపని. నాకు బుద్ధిబలం వున్నది. నేను వ్యాపారం చేస్తాను. ఒక వెయ్యి వరహాలు యివ్వు.'' అని అడిగాడు.

తండ్రి వాడికి వెయ్యి వరహాలు యిచ్చాడు.

వెంకప్ప ఊళ్ళో ఏ వస్తువు ఎంత ధరకు అమ్ముడుపోతున్నదో చూశాడు. చుట్టుపక్కల ఆ వస్తువులు చవగ్గా దొరికే ప్రాంతాలేవో తెలుసుకున్నాడు. అక్కడి నుంచి సరుకు కొని తెచ్చి, ఊళ్ళో మిగిలినవాళ్ళకంటె కాస్త చవగ్గా అమ్మడం ప్రారంభించాడు. వాడి వ్యాపారం దినదిన ప్రవర్థమానమై పోయింది. వ్యాపారం యింత సులభమా అని ఆశ్చర్యపోయాడు, వెంకప్ప. మొదటి రెండు, మూడు మాసాల్లోనే తండ్రి వాడికిచ్చిన వెయ్యి వరహాలనూ, పదివేల వరహాలు చేశాడు.

అన్నలు తనను అందరివద్దా వెర్రి వెంగళప్ప అంటారని వాడికి తెలుసు. అందుకని వెంకప్ప పనిగట్టుకుని ప్రతి వ్యాపారస్థుడి దగ్గరకూ వెళ్ళి, ''ఈ రెండూ, మూడూ మాసాల్లో నా దగ్గిర డబ్బు పది రెట్లయింది. మీ అందరికూ్కడా అంత



పెద్ద లాభాలు వస్తున్నయ్యా?'' అని అడిగాడు.

ఒక్క వ్యాపారి కూడా తనకు పెద్దగా లాభాలు వస్తున్నవని ఒప్పుకోలేదు. ''నీకు అంత పెద్ద లాభాలు ఎలా వస్తున్నాయో. మాకు అంతు చిక్కడం లేదు. అతి కష్టం మీద, మా పెట్టుబడి మాకు తిరిగి వస్తున్నది,'' అన్నారు వాళ్ళు.

వెంకప్ప ఆశ్చర్యపోయి, తనంత తెలివైనవాడు లేడనుకున్నాడు. సంపాయించిన డబ్బును యిష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టేవాడు. నెలకు ఒక వెయ్యి రూపాయలు దాచగలిగితే చాలునని వాడి అభిప్రాయం.

ఆరు మాసాలు గడిచాక వెంకప్ప దగ్గిరకు, రాజుగారి పన్నులు వసూలు చేసే అధికారి వచ్చి, ''వ్యాపారంలో నీకు బాగా లాభాలు వచ్చాయికదా?'' అని అడిగాడు.

''అవును. ఈ ఊళ్ళో ఎవరికీ రానంతగా వచ్చాయి,'' అన్నాడు వెంకప్ప.

''నీ లాభాల సంగతి, నా దాకా వచ్చింది. నువు, రాజుగారికి ముప్పైవేల వరహాలు పన్నుగా చెల్లించవలసి వున్నది,'' అన్నాడు అధికారి.

''పన్నేమిటి?'' అంటూ ఆశ్చర్య పోయాడు వెంకప్ప.

''నీకు వచ్చిన లాభాల్లో ముప్పైశాతం రాజుగారికి పన్నుగా కట్టాలి. ఇంతవరకూ నీకు లక్షవరహాలు లాభం వచ్చింది. అంటే, ముప్పైవేల వరహాలు పన్ను కట్టాలి. నీ లాగే మిగతా వ్యాపారులు కూడా పన్ను కట్టాలి. త్వరగా పన్ను చెల్లించు,'' అన్నాడు అధికారి.

వెంకప్పకు గుండె ఆగినంత పనైంది. తను మళ్ళీ తండ్రి దగ్గిర అప్పు చేసి, యీ పన్ను చెల్లించాలి. మిగతా వ్యాపారులు లాభాలు రావడంలేదని ఎందుకన్నారో, వాడికప్పుడు అర్థమైంది.

వెంకప్ప తండ్రి, పన్నులు వసూలు చేసేవాడికి సర్దిచెప్పి పంపేసి,

"నీ అన్నలు చెప్పినట్టు, నువ్వు నిజంగా వెర్రి వెంగళప్పవే! మనం రాజధానికి వెళదాం. అక్కడ నీకు ఏదో ఒక ఉద్యోగం యిప్పిస్తాను," అన్నాడు వెంకప్పతో.

వెంకప్ప అవమానంతో తల వంచుకుని, "నా ఉద్యోగం నేను సంపాయించుకోగలను. అబద్ధాలు పలకవలసిన వృత్తిలో నేను రాణించలేకపోవచ్చు. కాని, నా తెలివితేటలతో రాజును మెప్పించగలను," అన్నాడు.

తండ్రి ఒక క్షణం ఆలోచించి, "సరే, అలాగే చెయ్యి. ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో! ఎంత గొప్పవాళ్ళకైనా సరాసరి రాజదర్శనం లభించదు. ఎవడైనా గొప్పవాడి ద్వారా రాజుగారి ప్రాపకం సంపాయించుకో. నీవల్ల పని కాకపోతే మాత్రం, నాకు కబురు చెయ్యి. వచ్చి సాయం చేస్తాను," అన్నాడు.

వెంకప్ప రాజధానీనగరం చేరాడు. ఆ రోజు రాజుగారు మహాకవి అప్పన్నకు కనకాభిషేకం చేస్తున్నాడు. జనం తండోపతండాలుగా వెళుతున్నారు. ఆ విశేషం చూడ్డానికి వెంకప్ప కూడా వెళ్ళాడు.

రాజ్యంలోని ప్రముఖులందరూ మహాకవికి ప్రణామాలు చేయడం వెంకప్ప చూశాడు. రాజు స్వయంగా ఒక పళ్ళెం నిండా బంగారు నాణాలు తెచ్చి, పురోహితులు మంత్రపఠనం చేస్తూండగా, అప్పన్నను అభిషేకించి, పాదాభివందనం



చేశాడు. అప్పన్న రాజును ఆశీర్వదించాడు. జయజయ ధ్వానాలతో సభ దద్దరిల్లిపోయింది.

ఆ సాయంత్రం వెంకప్ప, మహాకవి అప్పన్నను చూడబోయాడు. ఎంతో సులువుగా వాడికి, ఆయన దర్శనం లభించింది. వెంకప్ప ఆయనకు వినయంగా నమస్కరించి, "నా తెలివితేటలు ప్రదర్శించే అవకాశం యిస్తే, ఎంతటివారినైనా మెప్పించగలను. మీ మాట సాయంతో, నేను రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాయించుకోవాలనుకుంటున్నాను," అన్నాడు.

అప్పన్న ఆశ్చర్యపోయి, "నాయనా, నువ్వెవరివో గాని వెర్రి వెంగళప్ప లాగున్నావు. అలా కాకపోతే, కొలువులో ఉద్యోగం కోసం నా దగ్గిరకు రావు," అన్నాడు.

వెంకప్ప ముఖం చిన్నబుచ్చుకుని. "అంతా అన్నట్టే, మీరూ అన్నారు! రాజుగారి చేత కనకాభిషేకం చేయించుకున్న మీకంటె గొప్పవారు, నాకెక్కడ దొరుకుతారు?" అన్నాడు.

అప్పన్న నవ్వి, "వెర్రివాడా, యీ సంగతి తెలియదా? ఒక కవిని సన్మానించడం రాజుకు గౌరవకారణం అవుతుంది. అందుకే ఆయన నాకు కనకాభిషేకం చేశాడు. అంతకంటె ఆయనకు నా మీద ప్రత్యేకాభిమానం అంటూ ఏమీ లేదు. ఉద్యోగం కావాలంటే మంత్రి దగ్గిరకు వెళ్ళు, సేనాధిపతి దగ్గిరకు వెళ్ళు, విదూషకుడి దగ్గిరకు వెళ్ళు. ఆఖరికి ఆయనగారి క్షౌరకుడూ, రజకుడూ అయినా, నీకు సాయపడవచ్చు. సన్మానం ముగిశాక, నే నెవరినో కూడా రాజుకు గుర్తుండకపోవచ్చు," అన్నాడు.

వెంకప్పకు యీ ప్రపంచమంతా అయోమయం అనిపించింది. వాడు, తండ్రికి కబురు పంపి, ఆయన ద్వారా రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాదించి, అనామకుడుగా చాలా కాలం సుఖంగా జీవించాడు.






## 2

[శాంతి సంపదలతో తులతూగుతున్న మరాళద్వీపానికి మందరదేవుడు రాజు. పొరుగున వున్న కుండలినీ ద్వీపంలో అరాజకం బయలుదేరింది. నరవాహనమిత్రు డనే సేనాని అధికారాన్ని హస్తగతం చేసుకుని, మరాళద్వీపం మీదికి దాడి బయలుదేరాడు. అదే సమయంలో అతడి వేగులు రాజు మందరదేవుణ్ణి బంధించి తీసుకుపోసాగారు. తరవాత—]

ఉరుములూ, మెరుపులతో జడివాన ప్రారంభమైంది. సముద్రపు తీరాన గల నిడుపాటి కొబ్బరి చెట్లనూ, సరుగుడు చెట్లనూ కూకటివేళ్లతో పెళ్లగిస్తూ తుఫాను గాలి వీచింది. సముద్రంలో ప్రాణాలకు తెగించి యుద్ధం చేస్తున్న మరాళ, కుండలినీ ద్వీప నావికాదళాలు చెల్లా చెదురు కాసాగినై. అప్పటికే తీరం చేరిన కొన్ని నావల నుంచి కుండలినీ సైనికులు దిగి, మరాళద్వీప సైనికులతో బాహాబాహి యుద్ధానికి తలపడ్డారు.

గుర్రాన్ని అదిలించి అతివేగంగా స్వారి చేస్తున్న మందరదేవుని చెవులకు కుండలినీ, మరాళ సేనల యుద్ధధ్వానాలు వినబడుతున్నవి. 'జై కుండలినీ!' అని అరుస్తూ భీకరంగా ముందుకు చొచ్చుకు వచ్చే కుండలినీ సైనికులను 'జై మరాళీ!' అని చెవులు చిల్లులు పడేలా అరుస్తూ,



మరాళ సైనికులు ఎదుర్కొంటున్నారు. ఆకాశాన పెనుమబ్బులు, గాలి తాకుడుకు చెల్లా చెదరవుతూండగా. ఉరుముల కఠోర శబ్దం భూమ్యాకాశాలను బద్దలు చేస్తున్నది.

"నా రాజ్యానికీ, నాకూ యింతటితో సరి!" అనుకున్నాడు మందరదేవుడు. తను తప్పించుకు పారిపోయే మార్గం లేదు. ఎదురు తిరిగి ద్రోహులైన తన అంగరక్షకులతో పోరాడేందుకైనా, తను నిరాయుధుడు. ఇలాంటి ఆపద నుంచి బయటపడటం ఎలానా అని అతడు ఆలోచించేటంతలో, "జై మరాళీ!" అన్న సింహనాదాలు అతడిని ఆశ్చర్యపరిచినై.

ఆ విధంగా నినాదాలు చేసినవారు మంత్రి పంపగా, మందరదేవుడి రక్షణకు బయలుదేరిన సైనికులు. వాళ్ళు అతి వేగంగా గుర్రాలను ముందుకురికిస్తూ, మందరదేవుడిని బందీ చేసిన ద్రోహులను సమీపిస్తున్నారు. ఆ నినాదాలు వినగానే మందరదేవుడు వెనుదిరిగి చూశాడు. మరు క్షణంలోనే అతడి కళ్ళు మిరుమిట్లు కొలిపేంత కాంతితో, చెవులు బద్దలయేంత ధ్వనితో పెద్ద పిడుగుపడింది. అతడు త్రుటికాలంలో కళ్ళు తెరిచేసరికి ద్రోహులైన ఇద్దరు అంగరక్షకులూ నేల మీద పడి గిలగిల తన్నుకుంటున్నారు. వాళ్ళు ఎక్కిన గుర్రాలలో ఒకటి మరణబాధతో తన్నుకుంటోంది. రెండవది పిచ్చి ఎత్తిన దానిలా దారీతెన్నూ లేకుండా పరిగెత్తుతున్నది.

మందరదేవుడు దఢాలున గుర్రం దిగాడు. అంతలో అతడి రక్షణకై బయలుదేరిన సైనికులు నలుగురూ అక్కడికి చేరారు. అందరూ మరణబాధతో విలపిస్తున్న అంగరక్షకుల కేసి నడిచారు.

మరణిస్తున్న అంగరక్షకులలో ఒకడు, మందరదేవుడి కేసి చేయి ఎత్తి, దగ్గరకు రమ్మన్నట్టు సౌజ్ఞచేశాడు. మందరదేవుడు అతణ్ణి సమీపించి దగ్గరగా కూర్చున్నాడు. వాడు మాట్లాడేందుకు ఆయాసపడుతూ:

"మహారాజా! మేం ఇద్దరం మీకు ద్రోహం తలపెట్టాం. కాని ఆ నీచకార్యానికి మేం ఒడిగట్టింది ధనం కోసం కాదు. ఈ కార్యంలో తనకు సహాయపడకపోతే, మా కుటుంబాలను సర్వనాశనం చేస్తానని, ఆ నీచుడు—నరవాహనమిశ్రుడు మాకు వర్తమానం పంపాడు. మేం కుండలినీ ద్వీపవాసులమని మీకు తెలియంది కాదు. మా ద్రోహానికి ప్రాయశ్చిత్తం అనుభవించాం. కాని మీకు చేసిన ద్రోహానికి పరిహారంగా ఒక సహాయం చేయదలిచాను. మీరు ఏ కారణం చేతనైనా యీ ద్వీపాన్ని వదలదలిస్తే—యిక్కడికి సూటిగా వున్న ఆ కొబ్బరితోటకు అవల, తీరానికి అనుకొని రెండు పడవలు వున్నవి," అంటూ ఆ అంగరక్షకుడు ప్రాణం విడిచాడు.

మందరదేవుడు లేచి తన కోట కేసి పరికించి చూశాడు. కోట బురుజుల పైనుండి సైనికులు అగ్గడలకేసి బాణాలు వదులుతున్నారు. కొందరు పెద్ద పెద్ద రాతిబండలను శత్రువులు పైకి దొర్లిస్తున్నారు. కుండలినీ సైనికులు నిచ్చెనల సాయంతో కోట గోడలు ఎక్కేందుకు ప్రయత్నిస్తున్నారు.

తన సైనికుల పరిస్థితి విషమంగా వున్నదని మందరదేవుడు గ్రహించాడు. ఇంత పెనుతుఫానులోనూ కుండలినీ సైనికులు, తన రక్షణ సైనికులను ఓడించి కోటను ముట్టడించారు. తను యిప్పుడు





శత్రుసైనికుల వెనకభాగాన వున్నాడు. నలుగురు సైనికులతో తను వాళ్లను వెనక నుంచి ఎదుర్కోవటం ఆత్మహత్యతో సమానం!

ఇలాంటి ఆలోచనలతో మందరదేవుడు కొట్టుమిట్టాడుతుండగా, అగ్నిపర్వతం బద్దలైనంత భయంకర శబ్దం వినిపించింది. మరుక్షణం లోనే అతడి కాళ్ళ కింద భూమి దద్దరిల్లింది. నిర్విణ్ణుడై అతడు కోట కేసి చూశాడు. కోట బురుజు ఒకటి గాలిలోకి లేచి ముక్కలు చెక్కలుగా కిందకు ఒరగటం కనిపించింది. సైనికుల హాహాకారాలూ, కేకలూ మిన్నుముట్టినై.

"సర్వనాశనమైంది! మందు దట్టించి కుండలినీ సైనికులు మన కోటగోడను బద్దలు కొట్టారు. మన ఓటమి క్షణాల్లో ఉంది," అన్నాడు మందరదేవుడు.

"అవును, మహారాజా!" అంటూ పక్కన వున్న నలుగురు సైనికులూ తలలు వంచారు.

ఇక తను మరాళద్వీపాన్ని వదలక తప్పదన్న నిశ్చయానికి వచ్చాడు మందరదేవుడు. ఒకసారి శత్రువు కోటను భేదించిన తరువాత దానిని వశపరుచుకోవటం ఏమంత కష్టం కాదు. ఆ పని ముగియగానే శత్రువులు తన కోసం వెతుకుతారు. తను ఖైదీగా చిక్కితే, చిత్రహింసలకు గురి చేయకపోయినా, ఆ క్రూర నరవాహనమిశ్రుడి చేతులలో అవమానం తప్పదు.

"పదండి, ఈ ద్రోహి చెప్పిన పడవల మాట నిజమే అయి వుంటుంది. మరాళ దేవి కరుణ వుంటే మనం సురక్షితంగా మరో ద్వీపం చేరగలం. ఆ దేవి సహాయంతోనే ఏదో ఒకనాడు ఈ మరాళరాజ్యాన్ని తిరిగి జయించగలం కూడా!" అన్నాడు మందరదేవుడు.

సైనికులు విచార వదనాలతో కోట వైపుకు చూచారు. కోట బురుజుల నుండి ప్రతిఘటిస్తున్న మరాళ సైనికుల జాడ

లేదు. కుండలినీ సైనికులు నిచ్చెనల సహాయంతో కోట గోడల పైకి నిర్భయంగా ఎగబాకుతున్నారు.

మందరదేవుడు ముందుకు సాగాడు. తమ రాజు నిరాయుధుడుగా వున్నాడని గ్రహించిన ఒక సైనికుడు, మరణించిన అంగరక్షకుల దగ్గర వున్న ఒక కత్తిని తీసి రాజుకు అందించాడు. అందరూ సముద్ర తీరాన గుబురుగా కనబడుతున్న కొబ్బరితోట కేసి బయలుదేరారు. ఉరుములూ, మెరుపులతో ధారాపాతంగా వర్షం కురుస్తూనే వున్నది.

నిరాశా నిరుత్సాహాలతో కుంగిపోతూ తలలు వంచుకుని నడుస్తున్న మందర దేవుడూ, సైనికులూ కూడా—వెనుక భాగాన అల్లంత దూరంలో కోలాహలం విని గిరుక్కున వెనుదిరిగి చూశారు. కోటవైపు నుంచి తమకేసి హుటాహుటిగా వస్తున్న కొందరు అశ్వికులు వాళ్ళకు కని పించారు. వెంటనే మందరదేవుడు పెద్దగా, "అరుగో, వాళ్లు కుండలినీ సైనికులు. మనను పట్టి బంధించేందుకు వస్తు న్నారు. ఈ మైదాన ప్రదేశంలో మనం అశ్వికులను ఎదిరించటం ప్రమాదకరం. ముందు ఆ కొబ్బరితోట చేరటం మంచిది!" అంటూ అటుకేసి పరిగెత్తసాగాడు. సైని కులు కూడా తమ రాజును అనుసరించి



పరిగెత్తసాగారు. అందరూ కొబ్బరి తోట చేరి అక్కడ చెట్ల వెనక నక్కి కోట దిక్కుకేసి చూశారు. కుండలినీ అశ్వ సైనికులు కొందరు వాయువేగంతో అటు వైపు వస్తున్నారు. మందరదేవుడు కత్తి దూసి, అక్కడకు అతిదాపుల నున్న సముద్రంకేసి చూశాడు. ద్రోహి అంగ రక్షకుడు చెప్పినట్టు అక్కడ రెండు పడవలు ఒడ్డున తేలి ఆడుతున్నవి. ఒక్క ఉరుకున ఆ పడవలను చేరి సముద్ర మార్గాన్ని అనుసరించటం క్షేమమా అన్న ఆలోచన కలిగింది మందరదేవుడికి. కాని రెండవ వైపుకు చూసేసరికి కుండలినీ అశ్వికులు - పదిహేను మంది దృఢ

కాయులు తోటను సమీపిస్తున్నారు. వారి చేతులలో తళతళలాడుతున్న కత్తులు మెరుపుల్లా కాంతిని ప్రసరిస్తున్నవి.

"విజయమో, వీరస్వర్గమో! మరి మార్గాంతరం లేదు," అంటూ మందరదేవుడు కత్తి ఝళిపించి, సైనికులను హెచ్చరించాడు. వారు కూడా కత్తులు దూసి చెట్ల చాటున పొంచి నిలబడ్డారు. తమ శత్రువులు ఏ చెట్టు చాటున దాగి వున్నదీ తెలియని కుండలినీ అశ్వికులు గుడ్డిగా తమ గుర్రాలతో చెట్ల మధ్యకు వచ్చేశారు. 'జై మరాళీ!' అంటూ మందరదేవుడు బెబ్బులిలా ముందుకు ఉరికి ఒక శత్రుసైనికుడి కంఠాన్ని కత్తితో నరికి వేశాడు.

మందరదేవుడి సింహగర్జన, కుండలినీ అశ్వికుల గుండె నిబ్బరాన్ని చీకాకు పరిచింది. ఇరుకు చెట్ల మధ్య చిక్కుకుపోయిన గుర్రాలను ఎటు తిప్పుకునేందుకూ సాధ్యం కాక వాళ్ళు తబ్బిబ్బుపడసాగారు. అదే అదనుగా మందరదేవుడూ, అతని సైనికులూ అశ్వికులలో ఒక్కొక్కరినే తమ వాడి కత్తులతో గాయపరచసాగారు.

అశ్వికులలో నలుగురైదుగురు కింద పడగానే, ఇది పనిగాదని మిగిలిన అశ్వికులు కిందకు దిగి మందరదేవుడినీ, అతని



సైనికులనూ ఎదుర్కొన్నారు. చెట్ల మధ్య బాహాబాహి యుద్ధం ప్రారంభమయింది. ఆ సంకులసమరంలో కత్తి దెబ్బలు కొన్ని శత్రువులకూ, కొన్ని గురి తప్పి చెట్లబోదెలకూ తగలసాగినై.

పోరాటం ప్రారంభమై ఒకటి రెండు ఘడియలు జరిగేసరికి కుండలినీ సైనికులలో చాలామంది మరణించారు. చెట్ల చాటున తప్పుకుంటూ దొంగమాటుగా ముందుకు దూకి, అంతలోనే చెట్టు చాటుకు తప్పుకుంటూ మందరదేవుడూ, అతని సైనికులూ చాలామంది శత్రువులను తుదముట్టించారు. అక్కడకు వచ్చిన పదిహేను మంది అశ్వికులలో

అధిక భాగం మరణించటమో, గాయపడి బొబ్బరించడమో ప్రారంభించేసరికి, మిగతా వాళ్ళు గుండె ధైర్యం సన్నగిల్లి అక్కడి నుంచి పారిపోసాగారు. అలా పారిపోయే శత్రువులను, 'జై మరాళీ!' అని అరుస్తూ మందరదేవుడి సైనికులు వెనుక నుంచి కత్తులతో పొడిచి, మరి కొందరిని హతమార్చారు.

కొద్దిసేపటిలో అంతా సద్దుమణిగింది. ఆకాశాన ఉరుముల రణగొణ ధ్వని తప్ప కోట ప్రాంతం నుంచి కూడా ఏ ధ్వనీ రావటం లేదు. చావు తప్పించుకున్న కుండలినీ సైనికులు కొందరు మాత్రం గుర్రాలను ఆ కొబ్బరి తోటలోనే వదిలి, కోట కేసి పరిగెత్తుతున్నారు. ఆసరికి కోట కుండలినీ సైనికులవశం అయిపోయింది. రాజప్రాసాద ప్రాంతంలో యింకా ఎదిరిస్తున్న కొద్దిమంది మరాళ సైనికులు మాత్రం వున్నారు.

మందరదేవుడికీ, అతడి సైనికులకూ స్వల్పమైన దెబ్బలు తప్ప ప్రమాదకరమైన గాయాలేమీ తగలలేదు. కాని అందరూ బాగా డస్సిపోయి వున్నారు.

మందరదేవుడు కత్తి ఒరలో పెట్టి, "ఇక మనం జాగు చేయటం క్షేమం కాదు," అంటూ తీరం దగ్గిర వున్న పడవల కేసి బయలుదేరాడు.

నలుగురు సైనికులూ ఒకసారి విచారంగా తలలు ఎత్తి కోటప్రాంతం కేసి చూసి, తలలు వంచుకుని తమ రాజును అనుసరించి నడిచారు.

ద్రోహి అయిన అంగరక్షకుడు చెప్పినట్టుగా రెండు పడవలైతే సముద్రతీరాన వున్నవి కాని, అవి సముద్రం మీద దూర ప్రయాణానికి పనికి వచ్చేవి కావు. అవి చాలా చిన్న పడవలు. తెరచాపల్లాంటి సాధనాలతో కాక తెడ్ల సహాయంతోనే వాటిని నడపవలసి వుంటుంది.

మందరదేవుడు పడవలను సమీపించి, హఠాత్తుగా ఏదో ఆలోచన వచ్చినవాడిలా సైనికుల కేసి తల పంకించాడు.

—(ఇంకా వుంది)






# రాజయోగి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకొని ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పూర్వం యోగి అయిన రాజు ఒకడు మొహమాటానికి పోయి తనను అభిమానించే ఇద్దరి మధ్య వచ్చిన చిన్న తగాదాను కూడా తీర్చలేకపోయాడు. నువ్వు కూడా ఏదో మొహమాటానికిపోయి అపరాత్రి వేళ ఇంతటి సాహసానికి పూను కున్నట్టున్నది. నీ కా రాజయోగి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

పూర్వం చంపకదేశాన్ని పాలించిన ధీర మల్లుడికి, వీరమల్లుడు, శూరమల్లుడు, గుణమల్లుడు అనే ముగ్గురు కొడుకులు. వారిలో చిన్నవాడైన గుణమల్లుడు

## బేతాళ కథలు



ఆధ్యాత్మిక విషయాలపై ఎక్కువ ఆసక్తి చూపుతుండేవాడు.

కొంతకాలం గడిచేసరికి ధీరమల్లుడు మరణించాడు. పెద్దవాడైన వీరమల్లుడి పట్టాభిషేకానికి ఏర్పాట్లు జరగసాగాయి. రెండవవాడైన శూరమల్లుడు తాను సింహాసనం ఎక్కేందుకు కుట్రలు పన్న సాగాడు. ఆ విషయం తన అనుచరుల ద్వారా వీరమల్లుడికి తెలిసి, ఇద్దరి మధ్య ఘర్షణ మొదలై, ఒకరినొకరు పొడుచుకొని మరణించారు.

ఇదంతా చూసిన గుణమల్లుడికి విరక్తి కలిగి, ఎవరికీ చెప్పకుండా ఆ రాత్రికి రాత్రే నగరం విడిచిపెట్టి పోయి, చాలా కాలం పాటు దేశసంచారం చేసి, ఎందరో సాధువులనూ, సన్యాసులనూ కలిసి, ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సంపాదించాడు.

చివరికి అతడు శంఖవరం గ్రామానికి దగ్గరగా వున్న అరణ్యాన్ని తన తపస్సుకు అనువయిన చోటుగా ఎన్నుకొని, అక్కడ తపస్సు ప్రారంభించాడు.

కొన్నేళ్ళు గడిచేసరికి అతని మీద పుట్టలు లేచాయి !

ఆ తరవాత కొంతకాలానికి శంఖవరం గ్రామస్తులు కొందరు తమ గ్రామానికి సమీపాన వున్న అరణ్యంలో కొంత భాగాన్ని చదును చేసి, వ్యవసాయానికి పనికి వచ్చే భూమిగా చేద్దామని బయలుదేరి వచ్చి, అరణ్యంలో చెట్లను నరుకుతూ గుణమల్లుడుండే పుట్ట దగ్గరికి వచ్చి, దాన్ని కూడా నేలమట్టం చేయాలని చూసేసరికి, వారికి అందులో గుణమల్లుడు కనిపించాడు. అతడికి ధ్యానభంగం అయింది.

గ్రామస్తులు భయంతో వణుకుతున్న చేతులెత్తి మొక్కారు. ఆయన వారినేమీ కోపగించలేదు. గ్రామస్తులకు ఆయన ముఖంలో గొప్ప తేజస్సు కనపడింది.

వాళ్ళు అప్పటికప్పుడే అక్కడ ఒక చిన్న పూరిపాక వేసి గుణమల్లుడిని అందులోకి చేర్చారు.

ఆనాటి నుంచి తరచు శంఖవరం గ్రామ ప్రజలు ఆయున్ని చూడడానికి రాసాగారు. ఒకసారి ఆయనను దర్శిస్తే చాలు, ఎన్నో మేళ్లు జరుగుతున్నాయన్న వార్త చుట్టుపక్కల వున్న అనేక గ్రామాలకు పాకింది.

ఆయనను తమ గ్రామంలోకి వచ్చి, తమతోపాటే వుంటూ తమకు జ్ఞానబోధ చెయ్యమని ప్రజలు అడిగారు. అందుకు ఆయన అంగీకరించాడు.

శంఖవరం గ్రామంలోని మోతుబరి రైతు ధనయ్య, ధనికుడు శరభయ్య గుణమల్లుడి భక్తులుగా మారడమే గాకుండా, ఆయన వుండేందుకు ఊరి మధ్యన మంచి భవనాలు కట్టి యిచ్చారు. ఈ విధంగా శంఖవరంలో చిన్న ఆశ్రమం లాంటిది తయారయింది. పొరుగు గ్రామాల నుంచి కూడా భక్తులు తండోప తండాలుగా రాసాగారు. అన్ని కార్యక్రమాలకు సంబంధించిన వ్యవహారాలూ ధనయ్య, శరభయ్య చూసుకోసాగారు.

రాను రాను వాళ్ళిద్దరికీ గుణమల్లుడి బోధనలలో కంటే ఆశ్రమ నిర్వహణకు సంబంధించిన అధికారంలో హెచ్చు ఆనందం కనపడింది. క్రమంగా వాళ్లిద్దరి మధ్యా స్నేహం చెడి, ఎవరికివారు పూర్తి అధికారాన్ని కోరుకోసాగారు.



ఒకరోజు గుణమల్లుడు భక్తులకు దర్శనం ఇచ్చే సమయాన ధనయ్య రహస్యంగా ఆయనతో, "శరభయ్య మంచి వాడు కాదు. ఆశ్రమ నిర్వహణ విషయంలో ఆయనను దూరంగా వుంచడం మంచిది!" అన్నాడు.

తర్వాత శరభయ్య కూడా గుణమల్లుడితో రహస్యంగా ధనయ్యలాగే చెప్పాడు.

ఆ రోజు రాత్రి చాలాసేపు ఆలోచించిన మీదట గుణమల్లుడు ఆశ్రమం వదిలి పెట్టి, ఎటో వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గుణమల్లుడి ప్రవర్తన అర్థంలేనిదిగా కని పిస్తున్నది. తన మీద ఎంతో భక్తిని,

ప్రేమను చూపడమే గాక, ఎంతో ఉదారంగా కూడా ప్రవర్తించిన ధనయ్య, శరభయ్యల మధ్య వచ్చిన చిన్న తగాదాను పరిష్కరించి, ఎవరు అర్హులో నిర్ణయించి వారికి ఆశ్రమ నిర్వహణను అప్పగించవలసింది పోయి, అయిపు లేకుండా పోవడంలో అతని ఉద్దేశం ఏమిటి? ఇద్దరూ తనకు కావలసిన వాళ్ళే గనక తీర్పు చెప్పడానికి మొహమాటపడి, తప్పించుకొని పోవడం న్యాయం అనిపించుకుంటుందా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గుణమల్లుడి ప్రవర్తన అర్థరహితమైనదేమీ కాదు. తనను అభిమానించే ధనయ్య, శరభయ్యల మధ్య తగాదాను తీర్చి, అర్హతను నిర్ణయించి పదవి ఇవ్వడానికి ఆయన రాజపదవిలో వున్నవాడు కాదు. కనీసం సాధారణమైన మనిషి కూడా కాదు. మామూలు మనుషులలోని బలహీనతలను ఏవగించుకొని అతడేనాడో వారికి దూరమయాడు. కాకపోతే గ్రామప్రజలలోని భక్తినీ, ముక్తిపట్ల వారు చూపుతున్న ఆసక్తినీ గమనించి, వారికి తనకు తెలిసిన జ్ఞానాన్ని తెలియజేయడానికి, వారి కోరికల మేరకు మనుషుల మధ్య బతికేందుకూ అంగీకరించాడు. అయితే తను అనుకొన్న భక్తులలో కూడా ముక్తిపట్లకన్న అధికారం పట్ల ఆసక్తి హెచ్చుగా వుండటం గమనించి జాడతెలియకుండా ఎటో వెళ్ళిపోయాడు. అతడలా వెళ్ళిపోవడానికి కారణం మొహమాటం కాదు. అధికారం కోసం తాపత్రయపడే ధనయ్య, శరభయ్యల మీద ఏవగింపు. ఈ ఏవగింపు అతడికి సహజంగా వున్నదే! అధికారం కోసం తన సోదరులు ఘర్షణపడి చనిపోయేసరికి అతడు రాజ్యాన్ని సైతం వదిలి వేశాడు కదా!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# మాయకల

శేఖరుడు, విఠలుడు మంచి స్నేహితులు. బాల్యం నుంచి యిద్దరూ కలిసి చదువుకున్నారు. చదువులు పూర్తయాక విఠలుడికన్న, శేఖరుడికి మంచి ఉద్యోగం దొరికింది. ఒకే ఊళ్ళో స్థిరపడ్డారు.

విఠలుడి భార్య శ్యామలకూ, శేఖరుడి భార్య విమలకూ మధ్య అంతగా స్నేహం కుదరలేదు. అందుకు కారణం, విమల ధనవంతుల యింటి నుంచి వచ్చినది కావడం. ఆమెకు శ్యామల అంటే చిన్న చూపు.

దురదృష్టవశాత్తూ ఒకసారి అగ్నిప్రమాదంలో విఠలుడి యిల్లు కాలిపోయింది. అతడు భార్యా, బిడ్డలతో బయటపడి ప్రాణాలు రక్షించుకున్నాడు. అతడి సర్వస్వం అగ్నికి ఆహుతి అయిపోయింది.

విఠలుడి దీనస్థితికి శేఖరుడు చాలా బాధ పడ్డాడు. తనలాగే అతడికి మరి కొందరు ఆప్తమిత్రులున్నారు. అందరూ కలిసి ధన సహాయం చేసి, విఠలుడు తిరిగి యిల్లు కట్టుకునేందుకు తోడ్పడవలసి వున్నది.

కానీ, సమయానికి శేఖరుడి దగ్గిర డబ్బు లేదు. భార్యకు పుట్టింటి వాళ్ళు పెట్టిన నగలు మాత్రం వున్నవి. విమలకు బంగారమంటే వల్లమాలిన మమకారం. నిద్రపోయేటప్పుడు కూడా నగలు మెడలో వుండవలసిందే.

శేఖరుడు యిరుకున పడ్డాడు. తను ధన సహాయం చేయలేకపోయినా, కనీసం బంగారు వస్తువుల్ని యిస్తే, విఠలుడు వాటిని ఎక్కడైనా కుదువపెట్టి డబ్బు తెచ్చుకోగలడు. పరిస్థితులు మెరుగయాక వాటిని తిరిగి తనకు యివ్వగలడు. కాని, విమల యిందుకు ఒప్పుకునే తత్వం గలది కాదని, అతడికి తెలుసు.

బొమ్మిడి అచ్చారావు



శేఖరుడు బాగా ఆలోచించగా ఒక ఉపాయం తోచింది. విమలకు కలల మీద ఎక్కడలేని మూఢనమ్మకం వున్నది. కలల్లో జరిగేవి, తరవాత నిజంగానే అనుభవంలోకి వస్తాయని ఆమె అంటూండేది. ఆమెకూ, శేఖరుడికీ వచ్చిన కలలు కొన్ని కాకతాళీయంగా నిజమయాయి. ఇప్పుడు శేఖరుడు, భార్యకు కలల మీద వున్న నమ్మకాన్ని, విఠలుడికి సాయపడేందుకు ఉపయోగించాలని నిర్ణయించుకున్నాడు.

ఒక రాత్రివేళ అతడు, భార్యను హడావిడిగా నిద్ర లేపాడు. ఆమె కంగారుపడి, మెడలోని నగలను తడివి చూసుకుని, "ఏం జరిగింది?" అని భర్తనడిగింది.

శేఖరుడు భయపడుతున్నట్టు ముఖం పెట్టి, "చాలా చెడ్డకల వచ్చింది. మన యింట్లో దొంగలు పడ్డారట," అన్నాడు.

విమల వణికిపోతూ, "దొంగలే! ఇప్పుడేం చెయ్యడం?" అన్నది.

"చేసేందుకేముంది, కలే కదా! తెల్లవారితే మర్చిపోతానని, నిన్ను నిద్రలేపి, యీ సంగతి చెప్పాను," అన్నాడు శేఖరుడు.

"కలే కదా అని అలా కొట్టివేయకండి. అదుగో, తొలికూడి కూసింది. తెల్లవారు జామున వచ్చిన కలలు నిజమవుతాయి. ఇదివరలో నిజమైన ఒకటి, రెండు కలలు తెల్లవారుజామువేళల్లో వచ్చినవే," అన్నది విమల.

"ఆ మాటా నిజమే అనుకో. ఇంతకూ, యిప్పుడేం చేద్దామంటావు?' అని అడిగాడు శేఖరుడు.

"ఈ బంగారు నగలన్నీ యింట్లో ఎక్కడో గొయ్యితీసి పాతిపెడితే, మరేం భయం వుండదు," అన్నది విమల.

"వచ్చిన దొంగ అంత తేలిగ్గా మనల్ని ఒదులుతాడా? ఇంట్లో ఏమీ దొరక్కపోతే, సొమ్ము ఎక్కడ దాచారని మనను హింస పెడతాడు," అన్నాడు శేఖరుడు.

విమల అవునన్నట్టు తలాడించింది. శేఖరుడు కొంచెం ఆగి, "ఒక పని

చేద్దాం. నాకు తెలిసిన ధనవంతుడొకాయన వున్నాడు. చెడ్డ కలల ప్రభావం ఒకటి, రెండు సంవత్సరాలకన్న ఎక్కువ వుండదు గదా! నగల్ని ఆయన దగ్గిర దాచిపెడదాం. ఇది నీ తృప్తి కోసమే. కలల మీద నీకున్నంత నమ్మకం నాకు లేదు,'' అన్నాడు.

విమలకు యీ ఆలోచన నచ్చింది. ఆ మర్నాడే శేఖరుడు, భార్య యిచ్చిన నగలు తీసుకుని విఠలుడి దగ్గిరకు వెళ్ళాడు. ఎంత చెప్పినా విఠలుడు వాటిని కుదువపెట్టి డబ్బు తెచ్చుకోవడానికి ఒప్పుకోలేదు.

శేఖరుడే వాటిని కుదువపెట్టి, డబ్బు తెచ్చి స్నేహితుడికిచ్చాడు.

స్నేహితుడి ఈ ఔదార్యానికి విఠలుడి కళ్ళు చెమ్మగిల్లాయి.

కొంతకాలం గడిచింది. విమల ఒక రోజున భర్తతో, ''ఇక మన నగలు తెచ్చేసుకుందాం,'' అన్నది.

శేఖరుడు తాను నగలు దాచిన ధనవంతుడు ఊళ్ళో లేడనీ, ఒక వారం రోజుల్లో తిరిగి వస్తాడనీ చెప్పాడు.

ఇది జరిగిన మూడవనాటి రాత్రి, దొంగ ఒకడు చేత కత్తితో, కళ్ళకు గంతలు కట్టుకుని ఇంట ప్రవేశించి, శేఖరుణ్ణీ, అతడి భార్యనూ నిద్రలేపి, ''ఇల్లంతా వెతికాను, కాస్త విలువైన వస్తువంటూ ఎక్కడా కనబడలేదు. కత్తి చూశారు గదా! నోరెత్తకుండా డబ్బూ, నగలూ



ఎక్కడ దాచారో చెప్పండి,'' అన్నాడు పళ్ళు కొరుకుతూ.

నిలువెల్లా వణికిపోతున్న భార్యను సముదాయిస్తూ శేఖరుడు, దొంగతో, ''బయిటి నుంచి చూసి, ఖరీదైన ఇల్లు గదా, పెద్ద మొత్తంగా డబ్బు దొరక్క పోతుందా అని లోపల ప్రవేశించి వుంటావు. మాది చిన్న సంసారమైనా, పై వాళ్ళతో సరితూగాలన్న ఆశకొద్దీ, కాస్త దుబారా ఖర్చులు చేస్తూంటాము. నిజం చెప్పాలంటే, మేం యిప్పుడు తలమునక లయ్యే అప్పుల్లో వున్నాం,'' అన్నాడు తొణకకుండా.

దొంగ కొంచెం సేపు వూరుకుని, ''ఛీ, దొంగతో అప్పులగొడవ చెప్పుకునే నువ్వు, ఏమన్న మగాడివి! అయినా యిందులో ఏదో మోసం వున్నదని నా అనుమానం. ఈసారి నిన్ను గురించి ముందుగా ఆరా తీసివస్తాను. నువ్విప్పుడు చెప్పింది అబద్ధ మని తేలిందో!'' అంటూ గట్టిగా కత్తి ఝళిపించి బయిటికి వెళ్ళిపోయాడు.

దొంగ అటు పోగానే విమల తేరుకుని, ''చూశారా, మీ కల నిజమయింది. అదృష్టం బావుండి, ముందుగానే జాగ్రత్త పడ్డాం,'' అన్నది.

మరి కొన్నాళ్ళు గడిచాక విరలుడు ఆర్థికంగా నిలదొక్కుకుని, కుదువపెట్టిన శేఖరుడి నగలు విడిపించి, అతడి కిచ్చాడు.

శేఖరుడు వాటిని తెచ్చి భార్యకిస్తూ, ''ఇంతకాలం గడిచాక, యింకా దొంగల భయమేమిటి?'' అన్నాడు.

విమల నగలను ఆప్యాయంగా ఒకటికి రెండుసార్లు కళ్ళకు అద్దుకుని. మెడలో వేసుకున్నది.

శేఖరుడు భార్య అమాయకత్వానికి నవ్వుకున్నాడు. ఆమె కలల పిచ్చి ప్రాణ మిత్రుడికి ఆపదలో సాయపడింది. తన కల నిజమని నమ్మించడం కోసం, అతడు మరొక స్నేహితుణ్ణి దొంగగా ఇంట్లో ప్రవేశపెట్టిన సంగతి, అతడేనాడూ భార్యకు చెప్పలేదు.





# స్నేహపాత్రత

అనురూపదేశపు రాజైన అనంతపాలుడు సంవత్సరంలో కొన్ని రోజులు, మారు వేషంలో దేశమంతా పర్యటించి, తన ప్రజల కష్టసుఖాలు తెలుసుకుంటూండే వాడు. ఒకసారి ఆయన ఒక గ్రామ వీధిలో నడుస్తూండగా, వీధి అరుగు మీద విచారంగా కూర్చుని వున్న ఒకామె కనిపించింది.

రాజు, ఆమెను విచారకారణం అడుగుదామనుకునేంతలో, పక్క ఇంటిలో నుంచి మరొక ఆవిడ బయిటికి వచ్చి, విచారంగా వున్న ఆమెను, "ఏం, కాంతమ్మా, మరీ అంత విచారంగా కూర్చున్నావు ?" అని అడిగింది.

ఆ ప్రశ్న వింటూనే కాంతమ్మ కళ్ళు నీళ్ళ పర్యంతమైపోతూ, "ఏం చెప్పను, పార్వతమ్మా! రాకరాక అమ్మాయికి మంచి సంబంధం వచ్చింది. వాళ్ళు కట్నం పెద్దగా అడగలేదు. కాని, పెళ్ళి ఖర్చులకైనా, ఒక వెయ్యి రూపాయలు సమకూడాలిగదా ? ఆయన ఎన్నిచోట్ల ప్రయత్నించినా, అప్పు కూడా పుట్టలేదు," అన్నది.

పార్వతమ్మకు, కాంతమ్మ భర్త చాలీ చాలని సంపాదన గురించి తెలుసు. ఆ భార్యాభర్తలు, ఈడొచ్చిన కూతురు పెళ్ళికోసం, సంవత్సరం నుంచి బెంగ పడిపోతున్నారు.

"కాంతమ్మా, నేనూ మీ అమ్మాయి పెళ్ళి గురించే అప్పుడప్పుడూ ఆలోచిస్తూంటాను. నాదీ అంత కలిగిన సంసారం కాదని, నీకు తెలుసుగదా. దేవుడి దయ వల్ల ఒక్క రెండు వేల రూపాయిల నిధి దొరికితే, అందులో ఒక వెయ్యి, నీ కూతురు పెళ్ళి ఖర్చుల కిచ్చి, మిగతా వెయ్యితో కొద్ది రోజులపాటయినా, చీకూ

కొండూరి సత్యనారాయణ

చింతా లేకుండా కాలం గడపాలని వున్నది," అన్నది పార్వతమ్మ.

రాజు యీ సంభాషణ విన్నాడు. ఇద్దరూ, యిరుగుపొరుగున వున్న బీద కుటుంబీకులని ఆయనకు అర్థమైంది.

ఆ మర్నాడు పార్వతమ్మ సూర్యోదయంతోనే నిద్రలేచి, వీధివాకిలి తెరిచేసరికి, గడప పక్కగా ఒక మూట కనిపించింది. అందులో రెండు వేల రూపాయిలున్నవి. వీధిలో ఎక్కడా జనసంచారం లేదు. ఆమె సంతోషంగా డబ్బుమూట తీసుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది.

కొంచెం పొద్దెక్కాక, రాజభటు డొకడు వీధిలో చాటింపు వేస్తూండడం పార్వతమ్మ చెవినిపడింది. గ్రామవీధిలో ఎక్కడో రెండు వేల రూపాయిల మూట జారిపోయిందనీ, ఊరి వెలపల మామిడి తోటలో విడిది చేసి వున్న రాజుగారికి దాన్ని తెచ్చియిస్తే, తగిన బహుమానం యిస్తారనీ, ఆ చాటింపు.

పార్వతమ్మ డబ్బుమూట తీసుకుని, రాజు దగ్గిరకు పోయి, అది దొరికిన విధం చెప్పి, ఆయన ముందుంచింది. రాజు పార్వతమ్మను మెచ్చుకుని, "ఈ రెండు వేలూ నీకు బహుమానంగా యిస్తున్నాను, తీసుకుపో," అన్నాడు.

ఇంటికి తిరిగి వస్తూనే పార్వతమ్మ, కాంతమ్మకు జరిగినదంతా చెప్పి, "ఈ డబ్బు దేవుడూ, రాజుగారూ కలిసి చేసిన సహాయం అనుకుందాం. ఇందులో



వెయ్యి రూపాయిలు నీకిస్తాను. అమ్మాయి పెళ్ళి సమస్య తీరిపోతుంది,'' అంటూ, మూటలోంచి వెయ్యి రూపాయిలు లెక్క పెట్టి, కాంతమ్మకు యిచ్చింది.

డబ్బు చూసి ఆ క్షణంలో కాంతమ్మ సంతోషించినా, ఆ తరవాత పార్వతమ్మ మీద ఆమెకు ఈర్ష్య పుట్టుకువచ్చింది. తన కూతురు పెళ్ళికి వెయ్యి రూపాయలు యిస్తానన్న తరవాతే పార్వతమ్మకు ఆ డబ్బు మూట దొరికింది. అంటే, అది దొరకడానికి తన కూతురు అదృష్టం ముఖ్య కారణం!

కాంతమ్మ దురాశకొద్దీ, యిలాంటి తల తిక్క ఆలోచనలు చాలా సేపు చేసి, ఆ సాయంత్రం పార్వతమ్మ పెరటిదొడ్లో బావినీళ్ళు చేదుకుంటూండగా, చడీ చప్పుడు కాకుండా ఇంట్లోకి పోయి, పెట్టెలో వున్న డబ్బుమూట తీసుకుని వెళ్ళిపోయింది.

ఆ తరవాత పార్వతమ్మ పెట్టె తెరిచి డబ్బు మూటకోసం చూస్తే, అది కనిపించ లేదు. ఆమె బాధపడుతూ, కాంతమ్మ దగ్గిరకు పోయి, సంగతి చెప్పింది.

కాంతమ్మ ఎక్కడలేని విచారం నటిస్తూ, ''ఎంత అన్యాయం! నా కూతురు పెళ్ళి ఎలాగోలా అవుతుంది. నువ్విచ్చిన వెయ్యిరూపాయిలూ తీసుకుపో,'' అన్నది.

''అలా అనకు. ముందు పెళ్లి ముఖ్యం. ఆ వెయ్యి రూపాయిలతో నా దరిద్రం తీరేనా!'' అన్నది పార్వతమ్మ.



కాంతమ్మ దొంగలా పార్వతమ్మ ఇంట్లోకి పోవడం, డబ్బు మూటతో తిరిగి బయిటికి రావడం రాజుగారు కాపలా పెట్టిన ఇద్దరు భటులు, వీధి అవతల ఒక ఇంటి ముందు కూర్చుని గమనించారు. వాళ్ళు కాంతమ్మ ఇల్లంతా వెతికి, రెండువేల రూపాయిలూ పట్టుకుని, ఆమెనూ, పార్వతమ్మనూ రాజు దగ్గిరకు తీసుకుపోయారు.

రాజు, పార్వతమ్మతో, "నీకిచ్చిన రెండు వేల రూపాయిలూ, నా భటులకు యీ కాంతమ్మ ఇంట్లో దొరికనై. పొరుగున వుండి, స్నేహం నటిస్తూ ఇలాంటి ద్రోహం చేసినందుకు, యీమెను కఠినంగా శిక్షించబోతున్నాను," అన్నాడు.

కాంతమ్మ వణికిపోతూ, చేసిన నేరం ఒప్పుకోబోతున్నంతలో పార్వతమ్మ అడ్డుపడి, రాజుతో, "ప్రభూ, మీ భటులు పొరబడ్డారు. నేను మొదట్లో కాంతమ్మ కూతురు పెళ్ళికి ఒక వెయ్యి రూపాయిలిస్తే, సరిపోతుందనుకున్నాను. కాని, కొంత ఆలోచించిన మీదట రెండు వేలూ యివ్వడం బావుంటుందని తోచింది. అలాగే యిచ్చాను. ఒక వెయ్యి రూపాయలు పెట్టెలో మూలుగుతున్నంత మాత్రాన, నాకు ఒరిగేదేమిటి!" అన్నది.

పొరుగింటావిడ తప్పిదాన్ని కప్పిపుచ్చేందుకు, పార్వతమ్మ యిలా చెపుతున్నదని గ్రహించిన రాజు, మనసులోనే ఆమె స్నేహపాత్రతను మెచ్చుకుని, పార్వతమ్మతో, "నీ నిజాయితీ మెచ్చదగింది. ఆ రెండు వేల రూపాయిలతోపాటు, నీకు మరొక వెయ్యి రూపాయిలు బహూకరిస్తున్నాను. ఈ డబ్బంతా నీ దగ్గిరే వుంచుకుని, కాంతమ్మ కుమార్తె పెళ్ళి సక్రమంగా జరిపించడమే కాక, ఆమె వక్రబుద్ధిని సరిచేసే బాధ్యత కూడా నీ మీదే పెడుతున్నాను," అన్నాడు.

డబ్బు తీసుకుని ముందు పార్వతమ్మా, చేసిన తప్పుకు చెంపలు వేసుకుంటూ వెనకగా కాంతమ్మా ఇళ్ళకు బయలుదేరారు.






బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు గొప్ప ధనికుడుగా పుట్టాడు. ఆయన పెరిగి పెద్దవాడై, పెళ్ళి చేసుకున్నాడు. కొంతకాలానికి ఒక రోజున బోధిసత్వుడి కొక కుమారుడు కలిగాడు. అదే రోజున ఆ ఇంటి దాసీదానికి కూడా ఒక మగపిల్లవాడు పుట్టాడు. వాడికి కటాహకుడు అని పేరు పెట్టారు.

ధనికుడి కుమారుడూ, దాసీపుత్రుడైన కటాహకుడూ పెరిగి పెద్దవాళ్ళు కాసాగారు. ధనికుడి కుమారుడు చదవటానికి వెళ్ళేటప్పుడు, కటాహకుడు అతని పలకా, పుస్తకాలు తీసుకుని వెంట వెళ్ళి వస్తూండేవాడు. ధనికుడి కొడుకు నేర్చుకున్న చదువంతా, దాసీపుత్రుడూ నేర్చుకున్నాడు.

చదువుకున్నవాడనీ, తెలివైనవాడనీ కటాహకుడికి పేరు వచ్చింది. అన్నీ వుండి కూడా తాను నౌకరుస్థాయిలోనే వుండటం కటాహకుడికి ఎక్కడలేని బాధా కలిగించింది.

తన విద్యకూ, తెలివితేటలకూ తగిన స్థానం సంపాదించాలని వాడికి కోరిక పుట్టి, యిందుకుగాను ఒక ఉపాయం ఆలోచించాడు.

కాశీకి కొన్ని కోసులదూరాన ప్రత్యంత దేశంలో బోధిసత్వుడి మిత్రుడొక లక్షాధికారి వున్నాడు. అతనికి తన యజమాని రాసినట్టుగా, కటాహకు డొక జాబు రాశాడు:

"నేను నా కుమారుణ్ణి తమ వద్దకు పంపుతున్నాను. మనమూ, మనమూ వియ్యమందటం ఉచితంగా వుంటుందని, నా విశ్వాసము. కనుక తమరు మా వాడికి తమ కుమార్తె నిచ్చి వివాహము చేసి, తమ ఇంటనే వుంచుకొనేది. తీరిక చేసు



కుని నేను వచ్చి, తమ దర్శనం చేసుకో
గలను.''

ఈ విధంగా ఉత్తరం రాసి కటాహకుడు దాని మీద తన యజమాని ముద్రిక వేసి, యజమాని ఖజానా నుంచి తనకు కావలసి నంత ధనం సంగ్రహించి, ప్రత్యంత దేశానికి వెళ్ళి, లక్షాధికారి దర్శనం చేసుకుని, ఆయనకు ఉత్తరం అందించాడు.

లక్షాధికారి ఉత్తరం చూసి ఉబ్బి తబ్బిబ్బయిపోయి, కటాహకుడికి తన కుమార్తె నిచ్చి, ఒక శుభ ముహూర్తాన పెళ్ళి చేసేశాడు.

కటాహకుడి కిప్పుడు అంతులేని నౌకర్లు. దుస్తుల విషయంలో, భోజనం విషయంలో, ఇతర విలాసాల విషయంలో అతనికి రాజోపచారంగా జరిగిపోతున్నది. అయినా వాడు నిత్యమూ, ''ఛీ, ఛీ ! ఈ ప్రత్యంత దేశ ప్రజలు నాగరికత అన్నదేమీ ఎరగరు! ఇదేం భోజనం? ఇవేం దుస్తులు ? ఇంత అనాగరికత ఎక్కడా చూడలేదు,'' అంటూ చీదరించుకునేవాడు.

ఈలోపల బోధిసత్వుడికి, కటాహకుడేమైనాడా అని సందేహం వచ్చింది. అతని జాడ ఎవరికీ తెలిసినట్టు కనబడలేదు. అందుచేత ఆయన అతన్ని వెదకటానికి, నాలుగు వైపులకూ మనుషులను పంపాడు. వారిలో ఒకడు ప్రత్యంత దేశం వెళ్ళి, కటాహకుడు ఒక లక్షాధికారి కూతురును పెళ్ళాడి, తన పేరు మార్చుకుని, తాను ఫలానా కాశీ ధనికుడి కుమారుణ్ణని చెప్పుకుంటున్నట్టు తెలుసుకున్నాడు.

ఈ వార్త తెలియగానే బోధిసత్వుడు చాలా నొచ్చుకున్నాడు. తాను స్వయంగా వెళ్ళి కటాహకుణ్ణి తీసుకువద్దామని ప్రత్యంత దేశానికి బయలుదేరాడు. ఆయన వస్తున్నాడన్న వార్త తెలియగానే, కటాహకుడు బెదిరిపోయాడు. అతడు పారిపోదామని ఆలోచించాడు గాని, అందువల్ల తనకు నష్టమేగాని లాభం కలగదు. అంతకంటె ఎంతో దయామయుడైన తన

యజమానిని మంచి చేసుకోవడమే సరి అయిన పని.

తన యజమాని వచ్చి, నిజం తెలుసు కొనకముందే, తాను ఆయనను మంచి చేసుకుని, జరిగినదంతా చెప్పి క్షమాపణ వేడుకుందామనుకున్నాడు.

అయితే, తాను యజమాని దగ్గిర నౌకరులా ప్రవర్తించటం చూసి అందరూ అనుమానపడవచ్చు. అందుచేత కటాహ కుడు తన సేవకులతో, "నేను అందరి కొడుకుల వంటివాణ్ణి కాను. నాకు, నా తండ్రి మీద ఎంతో పూజ్యభావం. నేను, నా తండ్రి భోజనం చేస్తూంటే, పక్కన నిలబడి విసురుతాను. ఆయనకు మంచి నీరూ అవీ నేనే స్వయంగా అందిస్తాను," అంటూ తాను నౌకరు చేసే పనులన్నీ వర్ణించి చెప్పాడు.

తరవాత కటాహకుడు తన మామగారి దగ్గిరకు వెళ్ళి, "మా నాన్న వస్తున్నాడు. నేనాయనకు ఎదురు వెళ్ళి తీసుకు వస్తాను," అని చెప్పాడు.

లక్షాధికారి సరేనన్నాడు.

కటాహకుడు తన యజమానిని అంత దూరానే కలుసుకుని, ఆయన కాళ్ళ మీద పడి, తాను చేసినదంతా చెప్పి, తనకు అపాయం రాకుండా కాపాడమని అభయం కోరాడు. బోధిసత్వుడు అభయం



ఇచ్చాడు. తరవాత కటాహకుడు బోధిసత్వుడితో సహా, మామగారి ఇంటికి వచ్చేశాడు.

లక్షాధికారి బోధిసత్వుణ్ణి చూసి ఆనందపడి, "తమరు కోరినప్రకారమే మా అమ్మాయిని మీ వాడికిచ్చి పెళ్ళి చేశాను," అన్నాడు.

బోధిసత్వుడు తృప్తిపడినట్టు కనిపించి కటాహకుడితో, తన కుమారుడితో లాగే మాట్లాడాడు.

తరవాత ఆయన లక్షాధికారి కుమార్తెను పిలిచి, "అమ్మా, నా కుమారుడు నిన్ను సరిగా చూసుకుంటున్నాడా?" అని అడిగాడు.

"ఆయనలో మరే లోపం లేదుగాని, భోజనం దగ్గిర ఆయనకు ఒకటీ రుచిం చదు. ఎన్ని విధాల మంచి వంటకాలు చేసినా, ఏదో ఒక తప్పు పడతాడు. ఏం చేసి ఆయనను తృప్తిపరచాలో, ఎంత ఆలోచించినా తెలియకుండా వున్నది," అన్నది కటాహకుడి భార్య.

"అవును. వాడు తిండి దగ్గర లోగడ కూడా యిలాగే నానాతిప్పలూ పెట్టేవాడు. అందుచేత యీసారి వాడు భోజనానికి కూర్చుని యిది బాగాలేదు, అది బాగా లేదు అన్నప్పుడు ఒక శ్లోకం చదువు. ఆ శ్లోకం నీకు రాసి యిస్తాను. దాన్ని బాగా కంఠస్థం చెయ్యి. అది చదివా వంటే, వాడు తప్పులు పట్టటం మానేసి, పెట్టినదేదో తింటాడు," అంటూ బోధి సత్వుడు ఆమెకు ఒక శ్లోకం రాసి యిచ్చాడు.

బోధిసత్వుడు కొద్ది రోజులు అక్కడ వుండి, కాశీనగరానికి తిరిగి వెళ్ళి పోయాడు. ఆయన వెళ్ళగానే కటాహకుడు మరింతగా విజృంభించాడు. భోజనం ముందు కూర్చుని వడ్డించిన ప్రతి పదార్థాన్నీ, నిందించసాగాడు.

ఒకరోజున కటాహకుడు యిలా చీదరించుకుంటూ వుంటే, అతడి భార్య యీ శ్లోకం చదివింది:

"బహూంపి సో వికత్థేయ్య అంఞం
జనపదం గతో,
అన్వాగంత్వాన దూసేయ్య భుంజ
భోగే కటాహక."

(కటాహకుడు అనేకవిధాల తిట్లు తిని, వేరొకచోటుకు పోయి, ఇతరులను దూషిస్తూ సకలభోగాలూ అనుభవిస్తాడు.)

దీని అర్థం కటాహకుడి భార్యకు తెలియదు. కాని కటాహకుడు మాత్రం, తన యజమాని తన పేరుతోసహా, తన రహస్య మంతా భార్యకు చెప్పేశాడని భయపడి పోయాడు.

ఆ తరవాత అతడు ఏది వడ్డిస్తే అది తిని సంతృప్తిపడుతూ, సుఖంగా కాలక్షేపం చేశాడు.





# దురాక్రమణ— ప్రతీకారం

ఆరవ శతాబ్దంలో మహమ్మద్ ప్రవక్త స్థాపించిన నూతన మతం ఇస్లాం, సంచార జాతులైన బిడోయినులను ఐక్యపరిచింది. తరవాత ఇస్లాం మత అధినేతలుగా వచ్చిన ఖలీఫాలకు హిందూస్థాన్‌ను జయించాలన్న కోర్కె కలిగింది.

ఇందుకు త్వరలోనే వాళ్ళకు ఒక మంచి అవకాశం లభించింది. లంక నుంచి బయలుదేరి, సింధు సముద్రతీర ప్రాంతాల ప్రయాణిస్తున్న నౌకలను సముద్రపు దొంగలు కొల్లగొట్టారు. లంకను పాలించే రాజు నుంచి కొన్ని విలువైన కానుకలను, ఆ నౌకలు ఇరాక్‌లో ఖలీఫా ప్రతినిధి అయిన అల్ హజాజ్ కోసం తీసుకుపోతున్నవి.





అప్పుడు సింధును పాలిస్తున్న రాజు పేరు దాహిర్. ఆయన నుంచి ఖలీఫా నష్టపరిహారం కోరాడు. కాని, అందుకు దాహిర్ తిరస్కరిస్తూ, సముద్రపు దొంగల దాడికి తాను బాధ్యుణ్ణికాదనీ, నౌకలు తగిన రక్షణలో ప్రయాణించ వలసిందనీ తెలియపరిచాడు.



ఈ జవాబు రాగానే అల్ హజాజ్ సింధును జయించేందుకు పెద్ద సైన్యాన్ని పంపాడు. దైబాల్ అనే చోట భయంకరమైన యుద్ధం జరిగింది. యుద్ధానికి సర్వ సన్నద్ధంగా లేక పోయినా, రాజు దాహిర్ వీరోచితంగా పోరాడి శత్రువులను ఓడించాడు. వాళ్ళ సేనానులు చాలా మంది మరణించారు.

ఓటమి వార్తవిని అల్ హజాజ్ ఉగ్రుడై పోయాడు. అతడు ఖలీఫా సహాయంతో మరింత పెద్ద సైన్యాన్ని సమకూర్చి, దానికి సేనానాయకుడుగా తన అల్లుడైన మహమ్మద్ ఖాసింను నియమించాడు. ఖాసిం ధైర్యవంతుడేగాక, యుద్ధ చతురుడు. అతడు దైబాల్ మీద దాడి చేశాడు.





ధనాశాపరుడైన కాకా కోటాల్ అనే సామంతుణ్ణి, ఖాసిం తన పక్షం చేసుకున్నాడు. జోతిష్యులు, రాజు దాహిర్ ఓటమి పొందుతాడని చెప్పినట్టు కోటాల్ ప్రచారం ప్రారంభించాడు. దాహిర్ సైనికులు నిరుత్సాహం చెందారు. కొందరు సేనానులు శత్రుపక్షమయ్యారు.

రాజు దాహిర్ యిలాంటి విషమ పరిస్థితుల మధ్య, శత్రువుతో వీరోచితంగా పోరాడి, గాయపడ్డాడు. విశ్వాసపాత్రులైన సైనికులు కొందరు ఆయనను, ఒక రహస్య ద్వారంగుండా కోటలోకి తీసుకుపోయారు. కాని, అక్కడ దాహిర్ మరణించాడు. ఆయన భార్య రాణీబాయి, యిది దుఃఖానికి సమయంకాదని, కత్తి చేతబట్టింది.





ఆమె కోట బురుజుపై నిలబడి, తన సైనికులను ఉత్సాహపరిచింది. ఆ విధంగా శత్రువును కొంత తడవు నిలవరించగలిగినా, అధిక సంఖ్యలో వున్న శత్రువులు కోటలో జొరబడసాగారు. రాణీబాయి సైనికులను ప్రోత్సహిస్తూ, కోట గోడలపైనుంచి, శత్రువుల మీదికి చమురులో తడిసి, భగభగమండుతున్న వస్తువులనూ, బండరాళ్ళనూ వేయించింది.

అయినా, శత్రువులు కోటలోని ఒక్కొక్క భవనాన్నే ఆక్రమించుకోసాగారు. ఇక ఓటమి తప్పదని గ్రహించిన రాణీబాయి, అంతఃపుర స్త్రీల వెంట ఒక గదిలో ప్రవేశించి, దానికి నిప్పు పెట్టించింది. శత్రువులు కోట తమ హస్తగతమైనప్పుడు, ఆ గదిలో కాలిపోయిన స్త్రీల శవాలను మాత్రమే చూడగలిగారు.





విజయుడైన మహమ్మద్ ఖాసిం, చావగా మిగిలిన రాజు దాహిర్ పౌరులలో ముప్పయి వేలమందిని బానిసలుగా ఇరాక్ దేశానికి తీసుకుపోయాడు. వాళ్ళల్లో చిన్నవారైన దాహిర్ కుమార్తె లిద్దరున్నారు. ఖాసిం వారిని ఖలీఫాకు కానుకగా యిచ్చాడు.

ఆ యువరాణుల సౌందర్యం చూసి, ముగ్ధుడైపోయిన ఖలీఫా వాళ్ళను వివాహ మాడదలిచాడు. కాని, యువరాణులు అతడితో ఖాసిం తమను లోగడే వివాహం చేసుకున్నట్టు చెప్పారు. ఇది విని ఖలీఫా పట్టరానికోపంతో, ఖాసింను చర్మపు నంచిలో బిగించి కట్టి, తన దగ్గిరకు తీసుకురమ్మని, భటులను ఆజ్ఞాపించాడు.





భటులు ఖాసింను చర్మపు సంచిలో కుట్టి ఖలీఫా దగ్గరకు తీసుకుపోతూండగా, అతడు మరణించాడు. దాహిర్ కుమార్తెలు, ఖలీఫాతో, ఖాసిం తమను వివాహమాడిన మాట నిజంకాదనీ, తమ తల్లిదండ్రులనూ, రాజ్యాన్ని ధ్వంసం చేసినందుకు, అతడిపై యీ విధంగా పగతీర్చుకున్నామనీ చెప్పారు. ఖలీఫా క్రోధోన్మత్తుడైపోయి, వారిద్దరినీ సజీవంగా భూమిలో పాతిపెట్టించాడు.

# నిత్యం దిగులే!

దినభత్యానికి కూలిపని చేసే రంగయ్య, ఎప్పుడూ దిగులుగా వుండడం గమనించిన అతడి మిత్రుడు గోవిందయ్య, రంగయ్యను అందుకుకారణం అడిగాడు.

"ఏం చెప్పమంటావు, గోవిందయ్యా! మా యజమాని యిచ్చే రోజు కూలీ ఎంత తక్కువంటే, అది నాకు ఉప్పుకూ, పప్పుకూ కూడా సరిపోదు. ఎవరైనా నీ వంటి వాళ్ళు చెబితే, నా రోజు వారీ కూలి పెంచుతాడేమో. కాస్త మాటసాయం చేసి పుణ్యం కట్టుకో! తిండి చాల నందున ఓపికలేక, నెలలో చాలా రోజులు పనికి పోక, నాగాలు కూడా పెడుతున్నాను," అన్నాడు రంగయ్య.

గోవిందయ్య, రంగయ్య యజమానితో మాట్లాడి నచ్చజెప్పి, అతడి దినభత్యం రెట్టింపు చేయించాడు.

కొన్నాళ్ళు జరిగాక రంగయ్య యింకా దిగులుగా వుండడం చూసి, గోవిందయ్య కారణం అడిగాడు.

"ఏం చెప్పేది, గోవిందయ్యా! ఒక్క రోజైనా పనికి నాగా పెట్టడానికి మనసొప్పడం లేదు. అలా నాగా పెట్టామో, బోలెడు కూలి డబ్బు నష్టం గదా? అదే నా దిగులు!" అన్నాడు రంగయ్య.

—ఎమ్. డి. సౌజన్య





# తప్పిపోయిన సిరి

ఒక చిన్న పల్లెలో మంధరుడు అనే ఒక బీద యువకుడు ఉండేవాడు. అతడికి తల్లిదండ్రులు గాని, చుట్టపక్కాలు గాని ఎవరూ లేరు. జీవనోపాధికి అవసరమైన ఏ వృత్తి కూడా అతడికి అలవడ లేదు.

ఒకనాటి రాత్రి భోజనాలయిన తరవాత పల్లెవాసుల్లో కొందరు పెద్దలు, లోకాభిరామాయణం మాట్లాడుకొనేందుకు ఒక రావిచెట్టు కింద కూర్చున్నారు.

మాటల సందర్భంలో పేదవాడయిన మందరుడి ప్రస్తావన వచ్చింది. వాడికేదైనా వృత్తి కల్పించి, ఒక ఇంటివాణ్ణి చేయటం పల్లెలో పెద్దలమయిన మన బాధ్యత అని నిర్ణయించుకొన్నారు.

ఆ మరుసటి రోజునుంచీ పల్లెలో వున్న నూరు కుటుంబాల వారికీ, కుటుంబానికి ఒక కావిడి చొప్పున చెరువులో నీళ్లు మందరుడు చేరబోయాలని అతడికి తెలియబరిచారు. ఇందుగ్గాను రోజూ ఒకరి ఇంట్లో భోజనం, అందరూ కలిసి అతడికి ఒక యిల్లు కట్టిపెట్టటం ఏర్పాటు జరిగింది.

ఆనాటి నుంచీ మందరుడు ఉదయం మొదలు సాయంకాలం వరకూ పల్లెలోని వారికి నీళ్ళు చేరబోస్తూండేవాడు.

కొన్నాళ్ళ తర్వాత ఒకనాటి రాత్రి ఊరి పెద్దలందరూ రావిచెట్టు కింద కూర్చుని మాట్లాడుకుంటూంటే, మందరుడు కూడా కొంచెం ఎడంగా కూర్చుని వింటున్నాడు.

ఆ పల్లెలో వున్న అతి పురాతనమైన శివాలయాన్ని గురించి సంభాషణ ప్రారంభమైంది. ఆ ఆలయంలో ఒక శాసనం వుందనీ, అందులో అతి చిత్రమైన విషయం చెక్కబడి వుందనీ ఒక వృద్ధుడు అన్నాడు.

ఆ శాసనంలో యిలా వున్నది: ఎవడైనాసరే శివలింగానికి నూటయాభై

బిందెల నీరు అభిషేకం చేస్తే చక్రవర్తి అవుతాడు.

పెద్దల్లో ఒకడు ఆ శాసనం వట్టి కల్ల అని వాదించాడు. నూటయాభై బిందెల నీరు శివలింగానికి అభిషేకం చేస్తేనే చక్రవర్తి పదవి లభ్యం అయేట్టయితే, ఆ పని ప్రతివాడూ చేయగలడనీ, అందరూ చక్రవర్తులు కాగలరనీ వెటకారంగా మాట్లాడాడు. కొంత వాదం జరిగిం తర్వాత తక్కిన పెద్దలు కూడా ఆ శాసనం కల్ల అయి వుంటుందని అంగీకరించారు.

ఈ వాదోపవాదాలన్నీ విన్న మందరుడికి ఆ రాత్రి నిద్రపట్టింది కాదు అతి పురాతనమైన ఆ శాసనం కల్ల ఎలా అవుతుంది? అనుకొన్నాడు. నూటయాభై బిందెల నీరు చెరువు నుంచి తెచ్చే ఓపికా, పట్టుదలా లేకనే వాళ్ళంతా దాన్ని గురించి యీసడింపుగా మాట్లాడారన్న నమ్మకం అతడికి కలిగింది.

"నా పనే నీళ్ళు మోయటం గదా! నూటయాభై బిందెల నీరూ తెచ్చి ఆ శివలింగానికి అభిషేకం చేస్తాను. శాసనం ప్రకారం, అయితే చక్రవర్తినౌతాను. లేదూ, ఇంత పుణ్యం అయినా రాకుండా పోతుందా?" అనుకొన్నాడు మందరుడు.

ఇక మరసటి రోజున పల్లెలో వాళ్ళకు నీళ్ళు చేరబోయటం అవగానే, శివ



లింగానికి అభిషేకం ప్రారంభించాడు. నీళ్లబిందెలు లెక్క కట్టి శివలింగం నెత్తిన పోయసాగాడు

సరీగా నూటనలభై బిందెల నీరు అభిషేకం చేసేసరికి మందరుడికి నిస్త్రాణ వచ్చింది. ఆయాసంతో కాళ్ళు తడబడసాగినై. ఇంకా ఒక్క పది బిందెల నీరే కదా కాస్త ఓపిక తెచ్చుకుంటె సరి అని దృఢనిశ్చయం చేసుకొన్నాడు.

కాని, మరి ఎనిమిది బిందెల నీరు తెచ్చేసరికి ఆయాసం మరీ ఎక్కువయింది. ఆయాసపడుతూ అతడు శివలింగాని కేసి చూసి, తరవాత తనను పరీక్షగా చూసుకొన్నాడు.

"నూటనలభై ఎనిమిది బిందెల నీరు అభిషేకం చేసినా నాలో చక్రవర్తి లక్షణాలు ఏమీ కనబడటం లేదు. అంత తెలిసిన పల్లె పెద్దలు ఈ శాసనం కల్ల అనటం నిజమే అయి వుంటుంది. నేను వెర్రిబాగులవాణ్ణి కనకే అనవసరంగా ఇంత శ్రమపడ్డాను. సరే, అయిందేదో అయింది. ఈసారి కావిడి తెచ్చి ఆ రెండు బిందెలనూ శివలింగం మీద ఎత్తి కొడతాను. నాకు అనవసరంగా ఇంత శరీరకష్టం కలిగించినందుకు ఈ శివ లింగం బద్దలు కావలసిందే! తరవాత ఊళ్లోవాళ్లు నన్ను తిట్టనీ, కొట్టనీ, ఏమైనా సరే!" అనుకుంటూ మందరుడు కోపంగా మళ్ళీ చెరువుకు గబగబా వెళ్ళి కావిడితో తిరిగి వచ్చాడు.

ముందు అనుకున్న ప్రకారం, పట్టరాని కోపంతో నీళ్ళ బిందెలు రెంటినీ ఎత్తి బలంగా శివలింగం మీద విసిరికొట్టాడు.

ఆ మరుక్షణంలోనే శివలింగం రెండుగా బద్దలై ఆ మధ్య నుంచి త్రిశూలం ధరించిన శివుడు ప్రత్యక్షమయ్యాడు. మందరుడు భయంతో వణికిపోసాగాడు. అప్పుడు శివుడు:

"ఓరీ, మందరా! నువ్వు మూర్ఖుడవు, మందబుద్ధివి! చేయదలచుకున్నది భక్తి శ్రద్ధలతో చేసి, ఫలాన్ని కోరటం బుద్ధిమంతుల లక్షణం. నీ మూర్ఖ చేష్టవలన ఫలితాన్ని పోగొట్టుకొన్నావు. ఆ రెండు బిందెల నీటినీ భక్తితో అభిషేకించినట్టయితే, నువు నిజంగానే చక్రవర్తిత్వానికి అర్హుడవయేవాడివి. సరే, యిక్కడి నుంచి బయటికి వెళ్ళు!" అని మందలించాడు.

మందరుడు తల వంచుకొని ఆలయా న్నుంచి బయటికి వెళ్లేందుకు వెనుదిరిగేంతలో బద్దలైన శివలింగమూ, శివుడూ కూడా అక్కడి నుంచి మాయమయారు.

మందరుడు ఈ సంగతి పల్లె పెద్దలకు చెప్పాడు. వారు ఆశ్చర్యపడి శివాలయానికి వచ్చి చూస్తే, అక్కడ శివలింగం గాని, శాసనం గల రాయిగాని కనబడలేదు.



# పెద్ద గీత - చిన్న గీత

సూరయ్య సామాన్య కుటుంబీకుడు. అతడికి యిద్దరు కొడుకులు. వాళ్ళు చిన్నవాళ్ళుగా వున్నప్పుడు సూరయ్య పలక మీద ఒక గీత గీసి, దాన్ని చెరపకుండా చిన్నది చేయమనేవాడు. పెద్దవాడు ఎంత ఆలోచించీ ఆ పని చేయగలిగేవాడు కాదు; చిన్నవాడు మాత్రం ఆ గీత పక్కన పెద్ద గీత గీసి, దాన్ని చిన్నది చేసి చూపించేవాడు.

కాలక్రమాన కొడుకులు పెద్దవాళ్ళయి, పెళ్ళిళ్ళు చేసుకుని వేరు, వేరు కాపరాలు పెట్టారు. సూరయ్య భార్యతో పెద్ద కొడుకు దగ్గిర వుండసాగాడు. కాని, అత్తాకోడళ్ళ కీచులాటతో సుఖం లేక కొన్నాళ్ళకు చిన్న కొడుకు ఇంట చేరాడు.

కాని, అక్కడా సూరయ్యకు చుక్కెదురైంది. చిన్న కోడలు అత్తమామలను లక్ష్య పెట్టక చాలా హీనంగా చూసేది. చివరకు కొడుకూ, కోడలూ ఏకమై వాళ్ళను ఇంట్లో నుంచి వెళ్ళగొట్టారు.

సూరయ్య తిరిగి పెద్ద కొడుకు ఇంటికి వచ్చి వుండసాగాడు. ఇప్పుడతడికి పెద్ద కొడుకు ఇంట్లో ఎంతో సుఖంగా వున్నట్టు తోచింది.

"నా పెద్ద కొడుకూ, కోడలూ బంగారం లాంటి మనుషులు. వాళ్ళ దగ్గిర నా కెంతో సుఖంగా వున్నది," అని సూరయ్య ఎరిగినవాళ్ళతో చెప్పుకోసాగాడు.

ఇది విన్న పెద్ద కొడుకు మనసులో బాధపడిపోతూ, "అదేం కాదు, నాన్నా! ఆ గీత ముందు, ఈ గీత చిన్నదైపోయింది, అంతే!" అనుకునేవాడు.

—కోనే నాగ వెంకట ఆంజనేయులు





# గడసరి పిశాచాలు

అవతారం భార్య కామాక్షిని తొందర పెడుతూ, "త్వరగా బయలుదేరు. బండి వాడు ఆలశ్యం అయిందంటూ గోలపెట్టే స్తున్నాడు," అన్నాడు.

కామాక్షికి ఈ ప్రయాణం ఏ మాత్రం యిష్టం లేదు.

"నువ్వొక వెర్రిమాలోకానివి! మనం పట్నం వెళ్ళవలసిందే," అన్నాడు అవతారం పట్టుదలగా.

మర్నాడు సాయంత్రం అతడి స్నేహితుడి చెల్లెలి పెళ్ళి. ఊళ్ళో వుంటే, ఏదైనా బహుమానం యివ్వక తప్పదు; అదొక దండగ ఖర్చు! ఇలా ఆలోచించి అవతారం. ఆ సాయంత్రమే స్నేహితుడితో, తన మామగారి ఒంట్లో బాగా లేదని కబురు వచ్చిందనీ, తను బయలు దేరి వాళ్ళ ఊరు వెళుతున్నాననీ చెప్పాడు.

అయిష్టంగా ప్రయాణానికి తయారవుతున్న భార్యతో, అవతారం, "ఎల్లుండికి మన పెళ్ళి జరిగి సంవత్సరం ముగుస్తుంది. పట్నంలో కొత్తబట్టలూ అవీ కొనుక్కుని, నిదానంగా తిరిగి వద్దాం. ఈ లోపల ఇక్కడ పెళ్లి ముగిసిపోతుంది," అన్నాడు.

కామాక్షికి ఇది అన్యాయంగా తోచింది. ఆ స్నేహితుడు తమ పెళ్ళికి వెండి పళ్ళెం చదివించాడు. ఆ సంగతి ఆమె భర్తకు గుర్తు చేసింది.

"నా పెళ్ళికి చదివించాడు. అంతే గాని, నా చెల్లెలి పెళ్ళికి చదివించాడా ఏం?" అంటూ అవతారం విసుక్కున్నాడు.

"అతడికి యీ ప్రయాణం వెనక వున్న గుట్టు తెలిస్తే, మిమ్మల్ని తప్పక అసహ్యించుకుంటాడు," అన్నది కామాక్షి.

మాచిరాజు కామేశ్వరరావు

"వాడికి యీ మాత్రం తెలివి తేటలు కూడానా? వాడొక మొద్దు స్వరూపం," అంటూ అవతారం తేలిగ్గా నవ్వేశాడు.

ఇద్దరూ చీకటి పడుతూండగా, బాడుగ బండిలో బయలుదేరారు. తెల్లవారే లోపల పట్నం చేరవచ్చని వాళ్ళ నమ్మకం. కాని, బండి సగం దూరం వెళ్ళేసరికి పెద్ద పెట్టున వర్షం ప్రారంభమైంది. వాన జల్లుకు భార్యాభర్తలిద్దరూ బాగా తడిసి పోయారు. ఇంతలో బండి చక్రం ఒకటి, దారి పక్కనున్న గుంటలో దిగిపోవడంతో, ఎద్దు కాలుజారి పక్కకు పడిపోయింది.

బండివాడు నానాప్రయాసాపడి, ఎద్దును నిలబెట్టాడు. కాని, అది కాలొకటి కుంటుతూ, పారిపోయేందుకు గింజుకో సాగింది. వాడు అవతారంతో, "ఇక, యీ బండి కదలటం కల్ల. ఆ కనబడే చెట్ల వెనక ఊరొకటున్నది. సగం బాడుగ యిచ్చి వెళ్ళండి," అన్నాడు చిరాకు పడుతూ.

ఇక చేయగలిగిందేమీ లేదు గనక అవతారం, భార్యతో బండివాడు చెప్పిన చెట్లకేసి బయలుదేరాడు. కొంత దూరం వెళ్ళాక, మెరుపుల వెలుగులో కొన్ని ఇళ్ళు కనిపించాయి. అయితే, ఆ సరికే అర్ధరాత్రి దాటిపోవడంతో, ఎక్కడా దీపపు కాంతి లేదు.



అవతారం దారిపక్కన వున్న ఒక పాడుబడిన ఇంటి అరుగు మీద కూర్చుంటూ, "ఈ రాత్రి, యీ పంచనే గడిపేద్దాం," అన్నాడు భార్యతో.

పాడుబడిన ఇళ్ళల్లో పిశాచాలు వుంటాయని, కామాక్షి ఎన్నో కథలలో విని వున్నది. ఆ రాత్రి అక్కడ గడపడమనగానే, ఆమెకు వణుకు పుట్టింది.

కామాక్షి చిన్న గొంతుతో, "పిశాచాలకు యిలాంటి ఇళ్ళంటే యిష్టమని, చాలా మంది చెప్పగా విన్నాను," అన్నది.

ఈ మాటలు వింటూనే అవతారానికి ముచ్చెమటలుపోశాయి. అయితే, భార్య ముందు చులకన కావడం యిష్టం లేక,



పైకి బింకంగా, ''పిశాచాలంటే ఎవరికి భయం? నేను పదహారు పిశాచాలను మారణ హోమం చేశాను. ముప్పైరెండు భూతాలను భూస్థాపితం చేశాను. నన్ను చూస్తేనే పిశాచాలు....'' అంటూ మాట పూర్తి చెయ్యకుండానే కెవ్వుమంటూ అరిచాడు.

ఆ అరుగు మీదనే, కొంచెం దూరంగా రెండు పిశాచాలు కూర్చుని వున్నవి. అవి రెండూ అవతారం మాటలు శ్రద్ధగా వింటున్నవి.

''నిన్ను చూస్తేనే పిశాచాలు కెవ్వుమంటాయని అరిచి చూపాలా? చెబితే చాలదూ! నీ అరుపుకు మాకు గుండెల్లో దడపుడుతున్నది. నీ మాటలకు అరుద్దామనే అనుకున్నాం. కాని, గొంతులు పెగల లేదు,'' అన్నవి పిశాచాలు.

పిశాచాలను చూడగానే కామాక్షికి ఒళ్ళు జలదరించింది. అవతారానికూడా నాలుక తడారి పోయింది. అయితే, పిశాచాలు భయపడుతున్నవని ధైర్యం తెచ్చుకుని, ''నా ముందుకు రావడానికి, మీ కెన్ని గుండెలు!'' అన్నాడు కోపం నటిస్తూ.

''బాబ్బాబు, మా మీద కోపగించుకోకు! మమ్మల్ని మారణహోమాలకూ, భూస్థాపితాలకూ గురి చెయ్యకు. మా దారిన మమ్మల్ని పోనీ,'' అన్నదొక పిశాచం.

''మమ్మల్ని ప్రాణాలతో వదిలావో, నీకు బతికున్నంతవరకూ తెగ రుణపడి వుంటాం,'' అన్నది రెండవ పిశాచం.

ఈ పిశాచాలు మరీ తెలివితక్కువవని, అవతారం అనుకున్నాడు.

''కంటబడిన పిశాచాలను ప్రాణాలతో వదలడం, మా ఇంటా వంటాలేదే! మరి, యిప్పుడేం చేయడం? నా పాత అలవాటు మార్చుకోవడం ఎలా?'' అన్నాడు అవతారం.

''ఈ రాత్రివేళ, మా కోసం ఆ పాత అలవాటు కాస్త మర్చిపో. అందుకు

ప్రతిఫలంగా, మేం దాచుకున్న బంగారమంతా, నీకు యిచ్చేస్తాం," అన్నవి పిశాచాలు.

అవతారం పరమానందపడిపోతూ, పైకి కటువుగా, "ఆ బంగారం ఎక్కడ దాచారో చెప్పండి. బంగారం కోసం కాదుగానీ, మిమ్మల్ని చూస్తూంటే జాలి కలుగుతున్నది," అన్నాడు.

"ఆహాఁ, దయా, జాలిగుండే గల ప్రభువులు! ఇలా దయచేయండి," అంటూ పిశాచాలు బయలుదేరాయి.

అవతారం వాటి వెనకగా బయలుదేరే సరికి, కామాక్షి భయంగా, "మీకేమన్నా మతిపోయిందా? నన్నిక్కడ వదిలి, పిశాచాల వెంటబడిపోవడమా!" అన్నది.

"వెర్రిదానా, నువ్వలా యిక్కడే కూర్చో. ఇవేవో బడుద్దాయి పిశాచాలు. క్షణాల మీద బంగారం తెస్తాను. నీకు బండిపట్టామందం వడ్డాణం రాసిపెట్టి వున్నది; ఎవరడ్డుకోగలరు!" అంటూ అవతారం, పిశాచాల వెంటవెళ్ళాడు.

పిశాచాలు చిన్నతుప్పలూ, పిచ్చి మొక్కలూ పెరిగివున్న ఒక చోటుకు అవతారాన్ని తీసుకుపోయి, "ఇక్కడ తవ్వి, మోయగలంత బంగారం ఎత్తుకుపో. మమ్మల్ని వదిలినందుకు, కోటిదణ్ణాలు," అంటూ అదృశ్యమయ్యాయి.

అవతారం అక్కడ కనిపించిన ఒక ఎండుపుల్ల తీసుకుని, వర్షానికి బాగా మెత్తబడిన నేలను తవ్వసాగాడు. ఒక గజం లోతు తవ్వగానే అతడికి మెరుస్తూ



ఒక బంగారు కాసు కనిపించింది. దాన్ని తీసి పక్కన పెట్టాడు. ఆ తరవాత వేళ్లతో తడిమితేనే, బంగారు కాసులు తగల సాగాయి. కొద్దిసేపటికల్లా అవతారం పక్కన పెద్ద బంగారు కాసుల కుప్ప తయారయింది. అయినా, ఆశచావక అవతారం యింకా తవ్వుతూనే వున్నాడు.

హఠాత్తుగా అతడికి, "ఎవరువాళ్ళు? ఆ తవ్వేదేమిటి?" అన్న ప్రశ్న వినిపించి, యీ లోకంలోకి వచ్చాడు.

ఆసరికి తెల్లవారుతున్నది. వచ్చిన వాళ్ళు గ్రామకాపలావాళ్ళు.

అవతారం చప్పున పైపంచను బంగారు కాసుల కుప్ప మీద కప్పేశాడు. కాపలా వాళ్ళలో ఒకడు దాన్ని పక్కకు లాగి, కెవ్వుమంటూ అరిచాడు. ఆ కుప్ప కేసి చూసిన అవతారానికి కళ్లు బైర్లు కమ్మినై. రాత్రంతా, తాను బంగారు కాసులని భ్రమపడింది, ఎముకల ముక్కలు! తానున్నది వల్లకాట్లో; తవ్వింది ఏదో పాత కాలపు సమాధిని.

గ్రామ కాపలావాళ్ళు అవతారాన్ని నానాతిట్లూ తిట్టి, చెరొక చేయీ పట్టుకుని లాక్కుపోయి, గ్రామాధికారి ముందు నిలబెట్టారు.

ఈ గొడవంతా దూరం నుంచి చూసిన కామాక్షి, కళ్ళ నీళ్ళు పెట్టుకుని జరిగిన దంతా గ్రామాధికారితో చెప్పింది.

గ్రామాధికారికి ఆమె మాటల్లో నమ్మకం కుదిరి, అవతారాన్ని గట్టిగా చీవాట్లు పెడుతూ, "మహా తెలివిగలవాణ్ణనుకుని స్నేహితుణ్ణీ, పిశాచాలనూ కూడా మోస గించబోయి, పెద్ద చిక్కులోనే పడ్డావు. నువ్వనుకున్నట్టు అవి బడుద్దాయి పిశాచాలు కాదు; గడసరి పిశాచాలు! ఈ అనుభవంతో అయినా, అతితెలివికి పోక, మంచిగా మసలడం నేర్చుకో," అన్నాడు.

అవతారం గ్రామాధికారికి క్షమాపణ చెప్పుకుని, అప్పటికప్పుడే బాడుగబండి కుదుర్చుకుని, స్నేహితుడి చెల్లెలి పెళ్ళికి హాజరయేందుకు బయలుదేరాడు.





# వంటవాడి వైద్యం

రామనాధబాబు అనే భూస్వామి దగ్గర రంగయ్య అనే వంటవాడు వుండేవాడు. రంగయ్య వంటపనుల్లో అందెవేసిన చెయ్యి. అతడు అద్భుతమైన రుచులతో రామనాధబాబుకు వంట చేసి పెట్టేవాడు.

ఒకనాడు రంగయ్య యజమానితో, తాను ఉద్యోగం మానుకుని పట్టణంలో వున్న తన కొడుకు దగ్గరకు వెళ్ళిపోతున్నానని చెప్పాడు.

ఆ తరవాత వారం తిరక్కుండానే సుబ్బుశాస్త్రి అనే అతను రామనాధబాబు దగ్గిరకు వచ్చి, "అయ్యా, తమకు వంటవాడి అవసరం వున్నట్టు తెలిసింది. నాకు వంట చేయడంతోపాటు వైద్యం కూడా తెలుసును," అన్నాడు.

వైద్యం తెలిసిన వంటవాడు దొరకడం అదృష్టం అనుకుంటూ రామనాధబాబు, "సరే, రేపే వచ్చి పనిలోచేరు," అన్నాడు.

సుబ్బుశాస్త్రి వంటవాడుగా పని ప్రారంభించాడు. అతడి వంట రుచిగానే వున్నట్టు రామనాధబాబుకు తోచింది. కాని, రెండు రోజులు గడిచేసరికి ఆయనకు అజీర్తి రోగం పట్టుకున్నది. వంటవాణ్ణి పిలిచి సంగతి చెప్పాడు.

సుబ్బుశాస్త్రి మూడు మందు పొట్లాలు యజమాని చేతిలో పెట్టి, భోజనానంతరం ఒక్కొక్క పొట్లం మందు వాడమని చెప్పి, "అయ్యా, నేను తమవద్ద వంటవాడుగా మాత్రమే కుదిరాను. వైద్యుడుగా నాకు వేరే కొంత ప్రతిఫలం ముట్టచెప్పడం ధర్మం గదా?" అన్నాడు.

రామనాధబాబు చిన్నగా నవ్వి, పొట్లం ఒక్కటికీ రూపాయి చొప్పున, మూడు రూపాయిలు సుబ్బుశాస్త్రికి యిచ్చాడు. ఆ మూడు పొట్లాల మందూ వాడగానే అజీర్తిరోగం మటుమాయమైంది.

రాంబాబు

ఇది జరిగిన వారం రోజుల తరవాత రామనాథబాబుకు విపరీతమైన తల నొప్పితోపాటు, ఒళ్ళు తిరగడం ప్రారంభ మైంది. సుబ్బుశాస్త్రి మూడు మందు పొట్లాలిచ్చి, యజమాని నుంచి మూడు రూపాయిలు పట్టుకుపోయాడు.

ఈ మందూ మంచి గుణం యిచ్చింది. రామనాథబాబు, సుబ్బుశాస్త్రిని బాగా మెచ్చుకుని, "వంట పనులు చేస్తూనే, నువ్వింత గొప్ప వైద్యుడివి ఎలా అయావో అర్థం కావడం లేదు!" అన్నాడు.

ఇలా సుబ్బుశాస్త్రి వండినవి తింటున్న రామనాథబాబుకు వారానికీ, పది రోజులకూ ఏదో జబ్బు చేయడం, సుబ్బుశాస్త్రి డబ్బు తీసుకుని మందులిచ్చి వాటిని కుదర్చడం పరిపాటి అయింది.

ఒకనాడు ఏదో ఆలోచిస్తున్న రామనాథ బాబుకు హఠాత్తుగా వంటవాడి మీద అనుమానం కలిగింది. రంగయ్య వంట వాడుగా వుండగా తనకేనాడూ సుస్తీ అంటూ చెయ్యలేదు. సుబ్బుశాస్త్రి వంట వాడుగా వచ్చాకే, యీ అజీర్తులూ, తల నొప్పులూ ప్రారంభమయినై!

ఆ మర్నాడు రామనాథబాబు, సుబ్బుశాస్త్రిని పనిలో నుంచి తీసివేశాడు. ఈ సంగతి తెలిసిన ముగ్గురు వంటవాళ్లు, ఉద్యోగంకోసం ఆయన దగ్గిరకు వచ్చారు.

రామనాథబాబు ఆ ముగ్గుర్నీ, "వంట చెయ్యడంతోపాటు, మీకేమైనా వైద్యం కూడా తెలుసునా?" అని అడిగాడు.

వాళ్ళల్లో యిద్దరు మాత్రం, తమకు కొద్దిపాటి వైద్యం చేతనవునన్నారు. మూడో వాడు తనకు వైద్యం తెలియదన్నాడు.

రామనాథబాబు వైద్యం తెలియదన్న వాడికి వంటవాడి ఉద్యోగం యిచ్చాడు. వాడి వంట ఆయనకు నచ్చింది. అన్నిటి కన్న ముఖ్యం: యీ వంటవాడు వచ్చాక ఆయనకు ఎలాంటి జబ్బూ చెయ్యలేదు.

"సుబ్బుశాస్త్రి వంటను వ్యాపారంగా, వైద్యాన్ని వృత్తిగా చేసుకున్నాడు. ఈ అనుమానం నాకు మొదట్లోనే రావలసింది," అనుకున్నాడు రామనాథబాబు.





# విఘ్నేశ్వరుడు

వినాయకచవితి నాటి మునిమాపు వేళ విఘ్నేశ్వరుడు తన దంతం లాగే ఉన్న చంద్రుణ్ణి చూస్తూ, నిండు బొజ్జతో మందంగా అడుగులు వేస్తున్నాడు. చిట్టెలుక వెంట వస్తున్నది.

నెలవంక విఘ్నేశ్వరుడి సంకేతం అంటారు. విఘ్నేశ్వరుడి నుదుట తెల్లని మంచి గంధంతో తీర్చిదిద్దిన బాలచంద్ర తిలకం, ఆకాశం మీది చవితి చంద్రుడి ప్రతిబింబంలాగ ప్రకాశిస్తున్నది. ఫాల చంద్రుడు, బాలచంద్రుడు అని కూడ విఘ్నేశ్వరుడికి పేర్లున్నవి.

కాలి బొటన వ్రేలికి చిన్న రాయి తగిలి వినాయకుడు అమాంతంగా బోర్లా పడ్డాడు. కడుపు పగిలిపోయింది. తిను బండారాలు వెలికివచ్చి నేల విరజిమ్ము కున్నాయి. అదే అదనుగా ఎలుక వాటిని గబగబా తినసాగింది. ఆ వినోదానికి, ఆకాశపు చిరునవ్వులా ప్రకాశించే చంద మామ పకపకా నవ్వాడు. దేవతలు మొద లైన వారంతా వచ్చి, పెద్ద సర్పంతో వినాయకుడి బొజ్జ కలిపి కుట్టారు.

పార్వతికి చంద్రుడి మీద చాలా కోపం వచ్చింది. ఆమె, "వినాయకచవితి నాడు చంద్రుణ్ణి చూస్తే; నీలాపనిందలు వచ్చి పడతాయి!" అని శపించింది.

అది మొదలు పిల్లల్ని సైతం చూడ నివ్వకుండా వినాయకచవితి నాడు చంద్ర దర్శనం కాకుండా, అంతా జాగ్రత్త పడుతూ వచ్చారు.

12. కృష్ణవినాయకీయం



ద్వాపరయుగం వచ్చింది. దేవకీ వసుదేవులకు చెరసాలలో పుట్టి, గోకులంలో యశోద ముద్దుల పట్టిగా పెరుగుతున్న బాలకృష్ణుడు పూతన, శకటాసురుడు, తృణావర్తుడు అనే రాక్షసుల్ని అప్పటికే చంపేశాడు, బాగా మాటలు నేర్చాడు.

ఆ రోజు వినాయకచవితి. యశోద పాలు పితుకుతున్నది. బాలకృష్ణుడు యశోద వీపుమీద నుంచి వంగి పాత్రలోని పాలలో ప్రతిబింబించిన చంద్రవంకను చూసి, "చందమామ! పాలల్లో చందమామ!" అంటూ చప్పట్లు చరిచాడు.

యశోద గతుక్కుమని, "ఎంత పని చేశావు కన్నా! ముందు, ముందు ఎన్ని నీలాపనిందలు పడవలసివస్తుందో మరి," అని నొచ్చుకుంది.

"నీలాపనింద అంటే ఏమిటమ్మా?" అన్నాడు కృష్ణుడు.

"ఉత్తినే నిన్ను దొంగ అంటారు!" అన్నది యశోద.

"విచారించకమ్మా! పాలు, వెన్న దొంగతనం చేస్తుంటానమ్మా, అప్పుడది నీలాపనింద అవదుగా!" అన్నాడు కృష్ణుడు.

"అరి పిడుగా! నీ నోట బ్రహ్మాండాలు విరుచుకు పడా!" అని అంటూ గోపమ్మ బుగ్గలు నొక్కుకున్నది.

"బ్రహ్మాండాలు చూశావామ్మా?" అని కృష్ణుడడిగాడు.

యశోద, "బ్రహ్మాండాలకేం గాని, పెద్దయినా నీ మీద అభాండాలు పడ్డం ఖాయం!" అంటూ సున్నితంగా బాలుడి తల మీద మొట్టికాయ పెట్టింది.

"అప్పుడు మళ్ళీ ఇలాగే చందమామను చూడాలి కదూ?" అన్నాడు కృష్ణుడు.

"పెద్దయ్యాక చూస్తే మరీ తప్పు!" అంది యశోద. మనసులో, "విఘ్నేశా! అభం శుభం తెలియని పసివాడు, నీడ చూశాడు, అంతే. మన్నించు!" అని అనుకుంటూ.

ఆ మర్నాడు బలరాముడు గబగబా వచ్చి యశోదతో, "అమ్మా! తమ్ముడు మన్ను తింటున్నాడు. అబద్ధం కాదు, వాడి నోరు చూడు!" అని చెప్పాడు. యశోద చరచరా వెళ్ళింది.

కృష్ణుడు మట్టి ముద్దలు వరసగా పేరుస్తున్నాడు. యశోద కృష్ణుడి చెవిపట్టి, "ఏదీ నోరు తెరు!" అన్నది.

"నన్ను నీచేత కొట్టించాలని ఎవరో ఏదో చాడీ చెప్పినట్టుంది. నీలాపనిందలు పడతాయని నిన్ననే కదా నువ్వు చెప్పావు? మట్టితో, ఉండ్రాళ్ళు లడ్లు చేస్తున్నానమ్మా. మట్టితో చేసిన వినాయకుడు మన్నుతో చేసినవైతేనే నిజంగా తింటాడమ్మా!" అన్నాడు కృష్ణుడు.

యశోద లెంపలు వేసుకుంటూ, "తప్పు నాయనా, తప్పు! మన్నుతో చేసినా, రాయితో చెక్కినా దేవుడు దేవుడే! అపచారం స్వామీ! విఘ్నేశా! పిల్లవాడి మాటలు ఏ మాత్రం పట్టించుకోకు!" అని ధ్యానించింది.

"అయితే వచ్చే వినాయక చవితికి వెన్న ఉండ్రాళ్ళు, నేతి లడ్లూ బోలెడన్ని చెయ్యి. ఎన్ని తింటాడో చూస్తా. తినకపోతే తినిపించుతా!" అన్నాడు కృష్ణుడు.

"ముందు నీ నోరు చూపించు!" అంటూ యశోద వంగి చూడబోతూంటే



కృష్ణుడు "ఆం" అంటూ బార్లా నోరు తెరిచాడు.

యశోద అలా చూస్తూనే ముచ్చెమటలు పట్టి చతికిల కూలబడింది. కృష్ణుడి నోటిలో బ్రహ్మాండాలు, నక్షత్రమండలాలు, సూర్యుళ్ళు, చంద్రుళ్ళు, సముద్రాలు, పర్వతాలు; సమస్తమూ కనిపించాయి. పాలు పితుకుతున్న యశోద వీపున వాలి, మెడ చుట్టూరా చిట్టిచేతులుచుట్టి, పాలల్లో చందమామను చూపిస్తున్న కృష్ణుడు కనిపించాడు. యశోద కల అనుకుని గిల్లుకొని కళ్ళు నులుముకొంది. కల కాదు, ఏ దేవతో, వినాయకుడో తనను మాయలో ముంచేస్తున్నాడని అనుకుంటూ చుట్టూరా



చూసింది. యశోద వెర్రిచూపులకు చుట్టూ చేరిన పిల్లవాళ్ళు కేరింతాలు కొడుతున్నారు. స్తంభం చాటున బలరాముడు ముసి ముసి నవ్వులు నవ్వుతున్నాడు.

కృష్ణుడు యశోద ముఖం మీదకు వంగి, "చూడమ్మా చూడు! మన్ను కనిపించిందా? బాగా చూడు!" అంటూ తెరిచిన నోరు మరింత దగ్గిరగా చూపుతుంటే, యశోదకు దేవాదిదేవుళ్ళు కనిపించారు. కృష్ణుడు పిల్లనగ్రోవి ఊదుతూంటే, విఘ్నేశ్వరుడు తాండవం చేస్తూ కనిపించాడు. కృష్ణుడు పెద్ద నల్లని సర్పం తలల మీద తంతున్నాడు. అది కృష్ణుణ్ణి చుట్టి వేస్తున్నది.

యశోద కెవ్వన అరిచి మూర్ఛపోయింది.

యశోద తిరిగి కళ్ళు తెరిచేసరికి మంచం చుట్టూరా గొల్లభామలూ, గొల్ల అవ్వలూ కనిపించారు.

"నాకేమైంది?" అని ఆశ్చర్యంగా అడిగింది యశోద.

ఆమెకు ఏదీ జ్ఞాపకం లేదు. ఏమీ జరగనట్టే అంతా మరిచిపోయింది.

"నీకేమైందో మాకు తెలీదు గాని, మా ఇళ్ళల్లో దొంగతనాలు జరిగాయి. ఆ దొంగ నీ ముద్దులకొడుకే! వెన్న, మీగడ, పాలు, పెరుగులు కుర్రమూకకీ, కోతులకూ పంచి పెడుతుండగా కళ్ళారా చూశాము!" అని చెప్పారు గోపకాంతలు.

యశోద, "ఏమిటేమిటీ! అవన్నీ మీ ఇళ్ళల్లోవని ఎలాగ అనుకున్నారు? మా ఇంట లేవనుకున్నారా? గోకులం ఊళ్ళోని ఇళ్ళన్నీ కలిపి, మా ఇంట వున్న వాటిలో సగానికైనా రావు; వెళ్ళండి, వెళ్ళండి!" అంటూ వాళ్ళను సాగనంపింది.

కృష్ణుడు మెల్లగా వచ్చి, "ఏం జరిగిందమ్మా?" అనడిగాడు.

"ఏం జరుగుతుందన్నానో అదే జరిగింది! నీ మీద నీలాపనింద పడింది!" అన్నది యశోద.

"నీలాపనింద తప్పించేసుకున్నానమ్మా. వాళ్ళు చెప్పిందంతా నిజమేనమ్మా!" అన్నాడు కృష్ణుడు.

యశోదకు పట్టరాని కోపం వచ్చింది. పెద్ద తాడుతో కృష్ణుణ్ణి పెద్ద రోలుకు వేసి కట్టింది. కృష్ణుడు ఆ రోటిని ఈడ్చుకుంటూ వెళ్ళి, జంటగా పెరిగిన రెండు మద్దిమాన్నుల సందున దూరి రోటిని లాగాడు. మహా వృక్షాలు రెండూ వ్రేళ్లతో పెళ్లగించుకొని కూలాయి. శాపవిముక్తులైన గంధర్వులు కృష్ణుణ్ణి నుతించి ఆకాశానికెగిసి, అదృశ్యులయ్యారు.



ఏడాది తిరిగింది. వినాయకచవితి వచ్చింది. రంగురంగుల పెద్ద వినాయక విగ్రహాన్ని నందుడు చేయించాడు. యశోద పాలమీగడతో పిండి కలిపి ఉండ్రాళ్ళు, వెన్న అప్పాలు, నేతిలడ్లు, పాలతో జిల్లేడుకాయలు దండిగా చేసింది.

నైవేద్యాలన్నీ పళ్ళెలనిండా నింపి, పూజామందిరంలో అమర్చి తలుపు చేరవేసి, యశోద అలా వెళ్ళింది.

కృష్ణుడు మెల్లగా పూజామందిరం ప్రవేశించి తలుపు మూసి, తినుబండారాల్ని వినాయక విగ్రహానికి అందిస్తూ, "తినవయ్యా తిను!" అంటూ ప్రతిమ బొజ్జ నిమిరాడు.

ప్రతిమ విఘ్నేశ్వరుడై తొండంతో అందుకొంటూ, "కృష్ణా! నేనందించేవి నువ్వూ తినాలి! విఘ్నేశ్వర చరిత్రలో ఇది సుందరకాండ!" అంటూ వెన్నతో చేసిన తినుబండారాల్ని కృష్ణుడి నోటకుకాడు. పళ్లాలు ఖాళీ అవుతున్నాయి.

యశోద పూజామందిరానికి వస్తూ గవాక్షం గుండా లోపల జరుగుతున్న సుందరకాండ చూచి కొయ్యబారిపోయింది. ముచ్చెమటలు పట్టాయి. మళ్లీ తమాయించుకొని, "అబ్బే, నే నేదో భ్రమపడుతున్నాను, నా కళ్ళకేదో మాయ తెగులు పట్టుకుంది!" అని సర్ది చెప్పుకుంటూ తలుపు తెరిచి వచ్చింది.



వినాయక విగ్రహం విగ్రహం లాగే వున్నది. అమర్చిపెట్టిన తినుబండారాలు కనిపించటం లేదు. కృష్ణుడు బిక్క మొహం పెట్టి చూస్తున్నాడు.

"నీ తిండి తగలడా! పూజ కాకుండా అంతా పాడుచేశావు," అంటూ యశోద కృష్ణుడి వీపు మీద గట్టిగా నాలుగు చరిచింది.

కృష్ణుడు ఏడుస్తూ, ఎవరికీ చిక్కకుండా పరుగు తీసి, కాళిందిమడుగు చేరాడు. ఆ వెనుకనే యశోదతోబాటు గోకులంలోని వారంతా ఆదుర్దాగా వెళ్లారు.

కాళిందిమడుగులో ఉంటున్న కాళీయ మహా సర్పం వల్ల గోకులవాసులకు ఎన్నో విధాలుగా హాని జరుగుతూ వస్తున్నది. కృష్ణుడు మడుగు ఒడ్డునే ఉన్న చెట్టెక్కి, మడుగు మధ్యకు వ్యాపించి ఉన్న కొమ్మ మీది నుంచి, మడుగులోకి దూకి, కాళీయ నాగుడి నెత్తి మీద పిడుగులాగ పడ్డాడు. గజ్జెలందెలు ఘల్లుఘల్లుమనగా కృష్ణుడు కాళీయుడి తలల మీద తాండవం చేశాడు. అద్భుతంగా కాళీయమర్దనం జరిగింది. కాళీయుడి శాపం తీరింది. కుమార్తెలను తీసుకెళ్లి పాతాళంలో వాసుకికి అప్పగించి, కాళీయరూపం ఉపసంహరించుకొని, విఘ్నం విఘ్నేశ్వరుడి అధీనమైంది.

కొడుకు నెత్తుకొని యశోద ఇంటి కొచ్చి చూసేసరికి, పూజామందిరంలో పళ్లాలన్నీ నిండుగా ఎలాగ పేర్చినవి అలాగే ఉన్నాయి. బాలకృష్ణుడి వీపు మీద మాత్రం యశోద వ్రేలి తట్లు కనిపిస్తున్నాయి. యశోద వాటిని చూసి, "నా చేతులు పడిపోను! నా కళ్ళకేదో మాయ రోగం వచ్చి నిష్కారణంగా కొట్టాను. పాపిష్ఠిదాన్ని!" అని వలవలా ఏడ్చింది.

"అమ్మా! బోలెడు వేళ ఉంది. పూజ చెయ్యవూ మరి!" అన్నాడు కృష్ణుడు. నందుడు యశోద కృష్ణుడిచేతే పూజ చేయించారు. నైవేద్యాల్ని ఊరందరికీ పంచారు. ఆ తినుబండారాల్లో

అమృతం ఉందనిపించింది. గోకుల మంతా ఆనందం పొంగిపొర్లింది,

కృష్ణుడు బాగా యెదిగాడు. గోవర్ధన గిరిని ఎత్తి ప్రళయ భీకరమైన జడివాన నుండి గోవులనూ, గోపకులనూ కాపాడి, ఇంద్రుడికి గర్వభంగం చేశాడు.

గోవర్ధన ప్రాంతంలో ఒకనాడు కృష్ణుడు ఆవులను కాస్తూండగా, చంకను పెద్ద మద్దెల పెట్టుకొని వస్తున్న ఒక పెద్ద మనిషి, "అబ్బాయీ, ఇక్కడ కృష్ణుడు అనే అబ్బాయి ఉన్నాడట. మురళి చాలా గొప్పగా వాయిస్తాడని చెప్పుకుంటున్నారు. ఆ మురళీ గానం ఏపాటిదో చూద్దామని వచ్చాను. అతడి ఉనికి చెప్పగలవా?" అన్నాడు కృష్ణుడితో.

"స్వామీ, ఆ కృష్ణపరమాణువును నేనే! తమరెవరో చాలా గొప్ప మృదంగ విద్వాంసుల్లాగ ఉన్నారు. తమరెవరో తెలియని వాణ్ణి, కాస్త సెలవియ్యండి, స్వామీ!" అని కృష్ణుడు చేతులు జోడిస్తూ అన్నాడు.

"నన్ను మృదంగకేసరి అని పిలుస్తారు. మాది దక్షిణ దేశం. మధురానగరానికి వెళ్తున్నాను. కంసుడు ధనుర్యాగం చేస్తాడుట. అప్పుడు నా మద్దెల విద్వత్తును ప్రదర్శిద్దామని వెళ్తున్నాను." అన్నాడు మృదంకేసరినని చెప్పుకొన్న పెద్దమనిషి.

అతని కాలికి రత్నఖచితమైన గండపెండెరం, చేతులకు కెంపులు తాపిన సింహ తలాటాలు, మెడలో బంగారు నిమ్మకాయల దండ, చెవులకు పెద్ద కుండలాలు ధగధగా మెరుస్తున్నవి. మద్దెల నిండా నవరత్న స్వర్ణ పతకాలు తాపి ఉన్నవి.

కృష్ణుడు వాటిని చూసి అబ్బురపడుతూ, "స్వామీ, నేను ఆవుల్ని కాసే సామాన్య గోపకుణ్ణి. నా పిల్లనగ్రోవి సాదా వెదురుబొంగు ముక్క! మీ దక్షిణదేశ విద్వాంసులు, తాళానికి ప్రసిద్ధులు. ఇహ నేను ఏదో ఒక రాగాన్ని ఊది, ఆవుల్ని పాలించుకోవడం తప్పితే, మరేదీ తెలియని గాలిపాటగాణ్ణి మాత్రమే!" అన్నాడు.






## 3

హాసన్ తన కథ పూర్తిచేసినాక అతన్ని పెంచుకున్న ఆమె తమ కథ అతనితో ఇలా చెప్పింది:

"మేమొక గంధర్వరాజు కుమార్తెలం. అందరమూ కలిసి ఏడుగురము. అందరమూ ఒక తండ్రి బిడ్డలమే గాని ఒక తల్లి బిడ్డలం కాము. అందరిలోకీ నేనూ, మా అక్క చిన్నవాళ్ళం. మిగిలిన మా అయిదుగురు అక్కలూ వేటకి వెళ్ళారు. త్వరలోనే తిరిగి వస్తారు. మా అక్క చెల్లెళ్ళను పెళ్ళాడే అర్హత గల వాళ్లెవరూ సృష్టిలోనే లేరని మా తండ్రి గారి నమ్మకం. మేము శాశ్వతంగా కన్యలుగానే ఉండిపోవాలని ఆయన నిర్ణయించి, మేము ఉండటానికి గాను ఈ మారుమూల ప్రదేశంలో ఈ భవనం కట్టించారు. ఈ ప్రదేశం మటుకు చాలా మనోహరమైనది. జలసమృద్ధి గలది. ఎక్కడ చూసినా పూలచెట్లూ, పళ్ళచెట్లూ కనిపిస్తాయి. చక్కని సరస్సులున్నాయి. వాటిలో రాజహంసలున్నాయి, స్వర్గంలాటి ఈ ప్రదేశంలో మేము చాలా సుఖంగా ఉన్నాము. మాకు ఒక్కటే కొరత ఉండేది. ఎంత కాలం గడిచినా మాకు మా ముఖాలు తప్ప కొత్త ముఖాలు కనిపించవు. నువ్వు యిక్కడికి రావటంతో మాకు ఆ లోటు తీరింది."

ఆమె తన తమ్ముడితో ఇలా కబుర్లు చెబుతూండగానే మిగిలిన అయిదుగురు రాకుమార్తెలూ వేటనుంచి తిరిగి వచ్చారు. తలవని తలంపుగా తమ కొక తమ్ముడు దొరికినందుకు ఎంతో సంతోషించి, వారతనిచేత చాలాకాలం ఉంటానని వాగ్దానం పుచ్చుకున్నారు.



హసన్ అక్కడి వింతలన్నీ చూస్తూ ఆ గంధర్వరాజు కుమార్తెల వెంట ఉండి పోయి, వారితో షికార్లకూ, వేటకూ వెళ్ళాడు. ఆ అక్కలను చూసుకుని అత నెంత గర్వించాడో అతన్ని చూసుకుని వారూ అంత ఆనందించారు. వాగుల వెంబడీ, తోటల్లోనూ ఆడుతూ, ఒకరి ప్రపంచం గురించి ఒకరు విచిత్ర విష యాలు తెలుసుకుంటూ, ఆ ఎనిమిది మందీ ఒక తల్లి కన్న పిల్లల్లాగా అన్యో న్యంగా మసలుకున్నారు.

ఒకనాడు అందరూ పొదల మధ్య చేరి పాటలు పాడుకుంటూండగా ఒక్కసారిగా ఆకాశంలోకి దుమ్ము లేచి సూర్యబింబాన్ని ఆవరించేసింది. అదే సమయంలో ఉరుములాటి ధ్వని వారికేసి వచ్చింది. రాజకుమార్తెలంతా భయపడిన వారిలాగా హసన్‌తో, "ఎటన్నా వెళ్ళి దాక్కో!" అన్నారు. కడగొట్టు రాజకుమార్తె హసన్‌ను చెయ్యి పట్టుకుని తోటలో ఒక చోటికి తీసుకుపోయి దాక్కోబెట్టింది.

త్వరలోనే గంధర్వుల బలగం ఒకటి వచ్చి భవనం దగ్గిర వాలింది. మరొక గంధర్వరాజు గౌరవార్థం రాజకుమార్తెల తండ్రి విందు చేస్తున్నాడట, తన కుమార్తె లను తీసుకు రమ్మని ఆయన తన పరివా రాన్ని పంపాడు. ఈ వార్త తెలియగానే కడగొట్టు రాజకుమార్తె హసన్ వద్దకు వచ్చి, "తమ్ముడూ, నిన్ను ఒంటరిగా విడిచి మేము కొన్ని రోజులపాటు వెళ్ళి పోవలిసి వచ్చింది. ఇదిగో తాళపు చెవులు. మేము తిరిగి వచ్చేదాకా ఈ భవనమంతా నీదే. కాని ఒక్క విషయం జాగ్రత్త. ఈ తాళపు చెవితో తెరుచుకునే గదిలోకి మాత్రం ప్రవేశించకు." అని నీలపురాయి పొదిగిన తాళపు చెవి అతనికి చూపింది.

తరవాత ఏడుగురు రాజకుమార్తెలూ తమ కోసం వచ్చినవారి వెంట తమ తండ్రి ఇంటికి వెళ్ళిపోయారు.

వారు వెళ్ళాక భవనమంతా బిక్కు బిక్కుమంటూ బోసిపోయినట్టున్నది.




హసన్ కాలుగాలిన పిల్లిలాగా గదులన్నీ తిరిగి, తన అక్కలు వాడే వస్తువులూ, వారు తిరిగే చోట్లూ చూసి వేదనపడ్డాడు. ఒకసారి అతను తెరవరాని తలుపువద్దకు వచ్చాడు. దాన్ని తెరవరాదన్న సంగతి జ్ఞాపకం వచ్చి వెనక్కు వెళ్ళిపోయాడు.

అయితే అతని తలలో ఆలోచనలు వెనక్కు తిరగలేదు: "ఈ తలుపు తెరవ రాదనటానికి కారణం ఏమై ఉంటుందీ? ఆ గదిలో ఏమి వింత ఉండవచ్చును? ఏమైనా ఆ గదిలోకి పోనని మాట ఇచ్చాను గద!" ఇలా అనుకుని కూడా ఆ తలుపును అతను మరువలేకపోయాడు. దాన్ని గురించిన ఆలోచనలతో అతనికి నిద్ర కూడా పట్టలేదు. ఏమైతే అయింది, ఆ తలుపు తెరుద్దామనుకున్నాడు. పోనీ తెల్లవారిన దాకా ఆగుదామనుకున్నాడు. చిట్టచివరకు, "ప్రాణం పోయినా సరే ఆ తలుపు తెరిచి అక్కడేమున్నదో చూడ వలసిందే!" అని నిశ్చయించుకున్నాడు.

హసన్ ఒక దివ్వె తీసుకుని ఆ తలుపు దగ్గిరికి వెళ్ళి తాళం చెవి పెట్టి తిప్పాడు. నిశ్శబ్దంగా తలుపు దానంతట అదే తెరుచుకున్నది. హసన్ నిర్భయంగా లోపలికి అడుగు పెట్టాడు.

ఆ గదిలో ఒక కర్రసామాను గాని, తివాసీగాని, చాపగాని, ఏమీలేదు. ఖాళీ గది. ఒక పక్కగా నిచ్చెన ఉన్నది. అది గది కప్పు దాటి పైకి వెళ్ళిపోయింది. హసన్ నిచ్చెన మెట్లెక్కి కప్పులో కంత గుండా పైకి వెళ్ళిపోయాడు.

పైభాగం సమతలంగా ఉన్నది. అక్కడ అతనికొక చిన్న తోట కనిపించింది. అందులో మొక్కలూ, పూల పొదలూ ఉన్నాయి. అతను ఆ తోటలోకి అడుగు పెట్టేసరికి ఒక అత్యద్భుతమైన మనోహర దృశ్యం అతని కంట పడింది. అతని ముందు ఒక నిశ్చలమైన సరస్సు అద్దంలాగా ఆకాశాన్ని ప్రతిబింబిస్తున్నది. సరస్సుకు అవతలి వైపున ఒక వింతైన భవనం వున్నది. దాని బురుజులు ఎంతో



ఎత్తుగా ఆకాశంలోకి చొచ్చుకుపోయాయి. ఆ భవనానికీ, సరస్సుకూ మధ్య చలవ రాళ్లతోనూ, చుక్కల రాళ్ళతోనూ కట్టిన మెట్లున్నాయి. మెట్ల దిగువన, నీటి పైకి పొడుచుకు వచ్చేలాగా ఒక-అరుగున్నది. దీనిని కెంపు, పుష్యరాగం, బంగారు, వెండి పలకలతో నిర్మించారు. ఈ అరుగు మీద నాలుగు గులాబీ రంగుగల స్ఫటిక శిలలతో కట్టిన స్తంభాలూ, వాటి పైన పరిచిన పలచని ఆకుపచ్చ రంగు బట్టా, దాని కింద చక్కని సింహాసనమూ ఉన్నాయి. వీటన్నిటినీ నిర్మించటంలో చూపిన పనితనం ఎంతేసి రాజులకూ సాధ్యపడేది కాదు.

హసన్ కొయ్యబొమ్మలాగా నిలబడి ఈ అద్భుత దృశ్యం చూసి ఆనందిస్తూండే సమయంలో పది పెద్ద పక్షులు ఎగురుతూ ఆకాశం నుంచి దిగివచ్చి సరస్సు ఒడ్డున వాలాయి. అవి కాస్సేపు ఒడ్డున అటూ ఇటూ తిరిగాక, వాటిలో పెద్ద పక్షి సింహాసనం వద్దకు కదిలి వచ్చింది. మిగిలిన తొమ్మిది పక్షులూ దాన్ని అనుసరించాయి.

హసన్ నిర్ఘాంతపోయి చూస్తూండగానే ఆ పక్షులన్నీ తమ తొడుగుల నుంచి స్త్రీల ఆకారంతో బయటికి వచ్చాయి. ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క చంద్రబింబం లాగున్నది. అందరూ తమ పక్షి తొడుగులను వదిలేస్తూనే సరస్సులోకి దూకి ఓలలాడ నారంభించారు. వాళ్ళు ఒకరినొకరు తరుముకుంటూ గట్టిగా నవ్వసాగారు. వారి నవ్వులకు దిక్కులన్నీ ప్రతిధ్వనించాయి. వారందరినీ అందంలోనూ, చలాకీతనంలోనూ మించిన ఒక సుందరి హసన్‌ను ప్రబలంగా ఆకర్షించింది. అతను ఒక పొద చాటున నక్కి, తనను ఆకర్షించిన సుందరిని తదేక దృష్టితో గమనించసాగాడు.

త్వరలోనే ఆ కన్యలు జలకాలు ముగించి, సన్నని వలిపెపు దుస్తులు ధరించి చాందినీ కింద విశ్రాంతి తీసు

కున్నారు. ఇంతలో ఎవరో, "తెల్లవార వస్తోంది. ఇక మనం బయలుదేరి పోదామా ?" అన్నారు.

వెంటనే అందరూ తమ తమ పక్షి తొడుగులు ధరించి, ఒక్కసారిగా ఆకాశంలోకి ఎగిరిపోయారు.

వాళ్ళు వెళ్ళినాక కూడా హసన్ శూన్యాకాశంలోకి చూస్తూ అలాగే చాలాసేపు నిలబడిపోయాడు. హసన్ అంతవరకూ ఎన్నడూ ప్రేమ అనేది ఏమిటో ఎరగడు. తీరా ప్రేమ అంటే ఏమిటో తెలిసినాక అతనికి జీవితమంతా శూన్యమైపోయినట్టయింది. అతను ఆ రోజల్లా ఒక యుగంగా గడిపి రాత్రి కాగానే మళ్ళీ సరస్సు వద్దకు వచ్చాడు. కాని ఆ రాత్రి ఆ కన్యలు రాలేదు. మరుసటి రాత్రి కూడా వారు రాలేదు. హసన్ అన్నమూ, నీరూ, నిద్రా మానేసి, నిరాశలో పడిపోయి, "ఇలా బతికేకన్న చావు మేలు!" అనుకుంటూ ఆ రోజుకారోజు శుష్కించిపోయి మంచం పట్టాడు.

పది రోజులు గడిచాక గంధర్వ రాజు కుమార్తెలు తండ్రి ఇంటి నుంచి తిరిగి వచ్చారు. వస్తూనే హసన్ అక్క అతన్ని వెతుక్కుంటూ వచ్చి, అతని దుస్థితి చూసి కంటనీరు పెట్టుకుంటూ, "ఇదేమిటి, తమ్ముడూ ? ఎందుకిలా అయిపోయావు? మొహమంతా పాలిపోయింది! కళ్ళు గుంటలు పడ్డాయి! నీ వ్యాధి ఏమిటో దాచకుండా చెప్పు!" అన్నది.

హసన్ కూడా కంటనీరు కారుస్తూ, "నేను చేసిన తప్పుకు శిక్ష అనుభవిస్తున్నాను. ఎవరూ కూడా నాకు సహాయం చెయ్యలేరు. నే నిలాగే ప్రాణాలు వదిలేస్తాను," అన్నాడు.

"అలా ఎన్నడూ అనుకోకు. నీ ప్రాణానికి మా అందరి ప్రాణాలూ అడ్డేస్తాము. నీవు చావటమే జరిగితే నేనూ చనిపోతాను," అన్నది అతని అక్క.

"నేను ఆహారం ముట్టి పది రోజులయింది," అంటూ హసన్ జరిగినదంతా ఆమెకు చెప్పాడు. —(ఇంకావుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



D. Janardhan Raju





M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ డిసెంబర్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గిరిజన సంగీతం

రెండవ ఫోటో : హరినామ సంకీర్తనం

పంపినవారు : ఆచంట హైమవతి, బెంగుళూరు-27

*బహుమతి మొత్తం రు. 25/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# నాణ్యత కొండెత్తు...వెల వీసమెత్తు.

అముల్‌వారి న్యూట్రముల్. అదే. శ్రేష్ఠతకు హామీ. పరిపుష్టమైన కోకో. హితకరమైన అముల్ పాలు. ప్రశస్తమైన మాల్టు. అతి ముఖ్యమైన విటమిన్లు, ఖనిజాలు. మరి సాటిలేని ఆ శక్తి కారక లక్షణాలు.
ఇవన్నీ మీకు మిగత వాటికన్న ఇంచుమించు 4 రూపాయలు తక్కువ వెలకు!
న్యూట్రముల్ వస్తాదుగా అవండి...
ఆ తేడా ఆనందించండి.

మిగతవాటికన్న
ఇంచుమించు
4 రూ. చవక!

ఇటువంటి ఆహార పానీయాల ధరల పోలిక (రూ.)*

| | 500 గ్రాం. | 800 గ్రాం. | 1000 గ్రాం. |
|---|---|---|---|
| న్యూట్రముల్ డబ్బా | 13.83 | – | 26.67 |
| మాల్టోవా సీసా | 17.58 | – | – |
| బోర్నవిటా డబ్బా | 17.68 | 26.97 | – |
| బూస్ట్ సీసా | 18.87 | – | – |

*మార్చి '81లో కొనుగోలుదారుల గరిష్ఠ ధర. స్థానిక పన్నులు అదనం.









మార్కెట్ చేసేవారు :
గుజరాత్ కోఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్. 388001.




## ఇదిగో!
## పెప్పర్‌మెంట్ రుచి కలిగిన
## ఒక చాక్‌లెట్ బిస్కట్

# స్క్రంచ్

## కరకర తినే చక్కని తినుబండారం

భారతదేశంలో ఈ రకం రెండు రుచుల తియ్యని తినుబండారం ఇదే మొదటిసారి—చాక్‌లెట్ మరియు మింట్ కలసినది, మృదువయినది, రుచికరమైనది, ఎక్కువ చాక్‌లెట్ క్రీమ్‌తో వున్నది—గోధుమవన్నె గల కరకరలాడే రెండు అందమైన బిస్కట్ల మధ్యవున్న పెప్పర్‌మెంట్ రుచిగల చాక్‌లెట్. ఇటువంటి దానిని మీరు యింతవరకు ఎప్పుడు రుచి చూడలేదు. ఇప్పుడే ఒక్క ప్యాకెట్ బిస్కట్ తీసుకోండి. కరకర నములుతూ తినండి. స్క్రంచ్...స్క్రంచ్...స్క్రంచ్...



**స్క్రంచ్ కరకర తినే చక్కని తినుబండారం**

ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు అందచేస్తున్న సరిక్రొత్త తినుబండారం

HTM-AFL-2345





మేమందరం గోల్డ్‌స్పాటర్స్

# వారెవ్వా! వహ్వా!
# ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు!

ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాలచిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్సిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.




గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజా యే మజా!

# జీవన్, హనులు తెల్పిన సత్యం
# ఆరోగ్యమే మహాభాగ్యం



ఓహ్! జీవితమంటే ఎంత చిత్రమైందో కదూ జీవన్!

ఏం, ఎందుకలా అంటున్నావ్?

ఇంతదాకా మనం మెదడుతోటీ, శరీరంతోటీ మనిషి సాధించిన ఎన్నో గొప్ప విషయాల్ని గురించి తెల్సుకున్నాంకదా. మరి నేనెప్పుడైనా అలాటిదేదో ఒకటి సాధించి ఖ్యాతి పొందగలనా అని!

హాఁ, దిగులు పడకు హనూ! నీవేమీ ప్రపంచ రికార్డులు స్థాపించనక్కర్లేదు. అసలు ముందు శరీరాన్ని, మనస్సునూ ఆరోగ్యంగా ఉంచుకునే ప్రయత్నం చేస్తే చాలదూ!

మరినేనా పనిచేస్తే నాకేమైనా ఒక పతకమో, ఓ అరటిగెలో దొరుకుతుందా?

ఓహ్, అంతేనా, నీకింకా మంచివే దొరకొచ్చు! మొదటిది నీకు ఆయుష్షు పెరగడం...

ఆఁ, ఉండుండొక్కమాట. ఆయుష్షుకూ జీవిత బీమాకూ ఏదో సంబంధ ముందనుకుంటా, కదూ!

ఉండకేం, తప్పకుండా ఉంది హనూ! నిజానికి జీవిత బీమా అనే శాస్త్రం ఎంతోమంది ఆయుష్షుల గురించి విపులంగా విచారించి తేల్చిందే.

సరేలే దాంతో నాకెందుకు, నాదింకా చిన్న వయస్సేకదా! ఈ జీవిత బీమాతో నాకేం పనుండదనుకుంటా.

లేకేం తప్పకుండా ఉంది. నీ సంరక్షకుడిగా నాకైనా ఉంది.

అదెట్లా?

నీ భవిష్యత్తును కాపాడడం నా విధి కాదూ మరి! జీవిత బీమాలో ఎన్నో పథకాలున్నాయి. చిల్డ్రెన్స్ అంటిసిపేటెడ్ పాలిసీ, చిల్డ్రెన్స్ డిఫర్డ్ అష్యూరెన్స్ పాలిసీ, ఎడ్యుకేషనల్ అన్యుయిటీ పాలిసీ, మ్యారేజ్ ఎండోమెంట్ పాలిసీ వగైరా వగైరాలాంటివి. అందరు తల్లిదండ్రులూ, సంరక్షకులూ వీటన్నిటిగురించీ తెల్సుకోవాలి మరి

ఎలా తెల్సుకుంటారు పాపం!

ఏముందీ, ఎల్ ఐసీ ఏజెంటు నెవర్నైనా వీట్ని గురించి అడిగితే సరి.

మరైతే నన్నిప్పుడే ఎల్ ఐసీ ఏజెంటు దగ్గరికి తీసుకెళ్లు!






లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

daCunha/LIC/120/81 TEL